ఆర్య విజ్ఞానం ౮ ప్రచురణము ౧౨

# అగ్నివంశపు రాజులు

[ నియోగ బ్రాహ్మణ ప్రభువులు ]



గ్రంథకర్త:

కోట వెంకటాచలం

ఆర్య విజ్ఞానం—2 ప్రచురణం - ౧౨

# అగ్నివంశపు రాజులు

లేక

## (నియోగబ్రాహ్మణ ప్రభువులు)

గ్రంథకర్త అండ్ ప్రకటనకర్త:

**కోట వెంకటాచలం**

గాంధినగరం :: విజయవాడ—2

అద్వైతబోధినీ, నిర్విచార జీవనం, బ్రహ్మాండసృష్టి విజ్ఞానం, మానవసృష్టివిజ్ఞానం, కలిశకవిజ్ఞానం, అభాసక్రైస్తవం, ఆంధ్రు లెవరు? జంబూద్వీపం, ధృవనివాసఖండనం, భారతీయశకములు, గుప్తరాజులెవరు?, అగ్నివంశపు రాజులు, అశోకునికాలము ఇత్యాది గ్రంథముల గ్రంథకర్త:

వికృతిసంవత్సర మార్గశిర మాసము

కలి 5051 క్రీ. శ. 1950 డిశంబరునెల



ప్రథమముద్రణ
1000 ప్రతులు

వెల: 2-0-0

అగ్నివంశపు రాజులు

# అంకితము

కలి. ముప్పదియొకటవ శతాబ్ద ప్రారంభమునగల

## భారతవర్ష చక్రవర్తి

ప్రమరవంశ సంభూతుడైన

## శ్రీ విక్రమాదిత్య చక్రవర్తికి

కలి 5051 ఆశ్వియుజ శుద్ధ దశమి

కోట వెంకటాచలం
గ్రంథకర్త

# విషయ సూచిక

*

| వ. సం. | విషయము | | పుట |
|---|---|---|---|

*

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 8 | 1948 | 1884 |
| 8 | 24 | దన్యులైన | దస్యులైన |
| 16 | 14 | రాజును | రాజులు |
| 16 | 15 | అనువారలై | అనువారిలో |
| 25 | 25 | 389 | 489 |
| 27 | 27 | 1-6-47 | 3-1-6-47 |
| 31 | 26 | ఐయిదు | ఐదు |
| 49 | 22 | ఇతి తేధితం | ఇతి తేకథితం |
| 54 | 21 | గంధ్వర్వసేనుడు | గంధర్వసేనుడు |
| 69 | 21 | Chatsw | Chatsu |
| 71 | 18 | Cousequently | Consequently |

[ ప్రఖ్యాత చరిత్రవేత్తలగు మహా మహోపాధ్యాయ, కళా ప్రపూర్ణ శ్రీ **చిలుకూరి నారాయణరావు** పంతులుగారు యం.ఏ. పి. హెచ్. డి. యల్. టి., అనంతపురం, గారిచే వ్రాయబడినది. ]

ఇంతవరకును భారతదేశ చరిత్ర నిర్మాణము పాశ్చాత్యుల వ్రాతల కనుకరణముగా మాత్రముండి అదియే మన విద్యాలయము లలో విద్యార్థులకు బోధింపబడుచుండుటచేతను, చరిత్రను బోధించు ఉపాధ్యాయులు చరిత్రను గ్రుడ్డిపాఠముగా బోధించుచుండుట చేతను తాము బోధించు విషయములనుగూర్చి తగిన విమర్శలేక గతానుగతిక ముగా చరిత్ర విద్యాబోధ సాగుచుండుటచేతను సత్యమైన దేశచరిత్ర మనకింకను లభింపలేదు ఇంగ్లీషు డిగ్రీలను సంపాదించిన విద్యాధికులు తగిన పరిశీలనలేక వ్రాసిన పాఠ్యచరిత్ర గ్రంథములే ఉపాధ్యాయులకాశ్ర యములగుచున్నవి. భారతదేశ చరిత్రనుగూర్చిన పరిశోధనలలో విద్యా ధికులైనవారు వ్రాసిన వ్రాతలలో పరస్పరపొందిక కానవచ్చుటలేదు. ఇది యిట్లుండగా చరిత్ర నిర్మాణమునకు వలయు మూలగ్రంథములు, శాసనాదికములుగాక అనాదిగా సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్న పురాణములమీది దృష్టిని పాశ్చాత్యులు గర్హించి యుండుటచే వానిపై మన వారికిని ప్రమాణదృష్టి తప్పినది. అయినను ప్రాచీన గ్రంథముల నామూలాగ్రముగా పరిశోధించి అందలి సత్యములకును యితరాధారము లకును సమన్వయమును కల్పించి సిద్ధాంతముల నేర్పరుపగల ధీశాలులు ఆంగ్ల విద్యాధికులు కాని వారు దేశమున లేకపోలేదు. అట్టి వారిలో ఆంధ్రులలో అగ్రస్థానమును వహింపగలవారు బెజవాడ వాస్తవ్యులు బ్రహ్మశ్రీ **కోట వెంకటాచలం** పంతులుగారు. వీరితో నాకు మూడేండ్ల నుండియు దగ్గర పరిచయమేగాక స్నేహముకూడ నేర్పడినది భారతీయ విజ్ఞానము, భారతీయులచరిత్ర, భారతీయుల సాంప్రదాయములను గురిం చిన సత్యములను లోకమున కెరుకచేయ వీరు చేయుచున్న కృషి అపా రము, అగాధమునైనది. పౌరాణిక విజ్ఞానమునంతటిని అవలోడనముచేసి మనకు పాఠకులకు సులభముగా అవగాహన మగునట్లు శ్రీ వెంకటా చలంగారు వ్రాసిన కలిశక విజ్ఞానము మూడుభాగములు, ఆంధ్రులెవరు? ఆర్యుల ధృవనివాసఖండనము, మానవసృష్టి విజ్ఞానము మొదలయిన గ్రంథములను చదివి ఆనందించగల భాగ్యము నాకు లభించినది.

శ్రీ వెంకటాచలంగారు పర్గీటరు వ్రాసిన "The dynasties of the kali Age" అను గ్రంథములో తెలియక చేసిన పొరబాట్లనేకములను సవరించి పర్గీటరు తానాధారపడిన ఆ పురాణములనుండియే సరియైన భాగముల నుద్ధరించి చక్కగా వ్యాఖ్యానించి పర్గీటరు చేసిన ప్రమాదభూయిష్టములైన నిర్ణయములను సవరించి సత్యమును ప్రకటింపగలిగిరి. కలిశక విజ్ఞానమును సమస్తాంధ్రులును పఠించి తీరవలయునని నా అభిప్రాయము. అట్లే మనము నివసించు జంబూద్వీప విభాగనిర్ణయంలో శ్రీవారు చేసిన నిర్ణయము సర్వధా శ్లాఘ్యముగా నున్నది. ఆంధ్రులెవరు? అనువ్యాసము యింతకుపూర్వము చరిత్రకారులందరును త్రొక్కిన త్రోవను ద్రొక్కక క్రొత్తదృక్పథమును వెల్లడించుచున్నది ఆంధ్రుల నిజస్వరూప మిట్టిదని శ్రీ వెంకటాచలంగారీగ్రంథమున నిరూపించిరి. ధృవనివాస ఖండనమను గ్రంథము శ్రీ తిలక్ గారు రచించిన "The Arctic Home" అను ఇంగ్లీషు గ్రంథములోని విషయమునకు సప్రమాణమైన విమర్శనమై యున్నది. శ్రీ తిలక్ గారి గ్రంథములోని పాండిత్య విలంబమునకు వేదవిజ్ఞానపు లోతు తెలియని హూణపండితులు ముగ్ధులై జేజేలు పెట్టుచుండ అది కాదని అనేక ప్రమాణములతో నిరూపింప సాహసించి నిలిచిన ధీరులింతవరకును శ్రీ వెంకటాచలం గారొక్కరే. "భారతీయశకము" లనెడి యీగ్రంథము చరిత్ర నిర్మాణమున కత్యంతోపయుక్తమైనది. వివిధ శక కాలములలో యిదివరకుండిన పొరబాట్లను చూపుచూ సరియైన కాలనిర్ణయములు సప్రమాణముగా యిందు నిరూపింపబడినవి. లోకములో ప్రబలముగ వ్యాపించిన అసత్య సిద్ధాంతముల నరికట్టి సత్యచరిత్ర నిరూపణమునకు కంకణము కట్టిన శ్రీ వెంకటాచలంగారి పాండిత్య గౌరవ మసాధారణమైనదని చెప్పుట కెట్టి సందేహమును లేదు. ఈ ధోరణిలో శ్రీవారు వ్రాసిన గ్రంథము లెన్నియో గలవు. అవన్నియు నచిరకాలములో ప్రకటితములై ఆంధ్రులలో చరిత్రవిజ్ఞానవ్యాప్తికి తోడ్పడగలవని విశ్వసించుచున్నాను.

ఇట్లు,

అనంతపురము,
14—10—1950.

చిలుకూరి నారాయణరావు వ్రాలు
మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
M. A. P. H. D. L. T.

ఇండియా గవర్నమెంటువారి ఆలిండియా రేడియో, విజయవాడ వారిచే ది 16–8–50 తేదీన 'ఆర్యవిజ్ఞాన గ్రంథముల'పై చేయబడిన సమీక్ష :—

# కలిశక విజ్ఞానము

విజయవాడ వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ కోట వెంకటాచల సిద్ధాంతిగారు రచించిన యుత్తమోత్తమ గ్రంథములలో కలిశక విజ్ఞాన మొకటి. ఇది రెండుభాగముల బ్రచురితమయినది. వీరు తమ ప్రచురణములకు నార్యవిజ్ఞానమను పేరిడిరి. వానిలోనిది మూడవది.

కలిశక నిర్ణయము సర్వతోముఖముగా శాస్త్రమునకు ననుభవమునకు దగియున్నది. ఇది పాశ్చాత్యగణకుల కనురోధమే అగునుగాని విరోధము లేదనుటకు లాక్లై లీ యను ఫ్రెంచి ఖగోళశాస్త్రజ్ఞుని మతము కూడ నిందు సూచితమయినది. రామాయణము భారతమువకంటె నిటీవల రచింపబడినదను నేటి చరిత్రకారుల సంకుచిత దృష్టిని మన మనుసరించుటకంటె శోచనీయమైన స్థితి యింకొకటిలేదని వీరు సయుక్తికముగా నుడివిరి. ఈబోధమును చరిత్రకారులు గ్రహించినగాని మనము ప్రపంచమున దలయెత్తికొని దిరుగనేరమనుట నిశ్చయము. ఆర్థిక రాజకీయ దాస్యము మనల వీడినదిగాని భావ దాస్యశృంఖలను మనము త్రెంపన నేరకున్నారమనుట నేటి స్వతంత్ర భారతదేశమున నెల్లెడల గానుపించుచున్నది. ఇది పరభాషావేషములు మననుండి పోవువరకును బోవదు...

కాళిదాసుని కాలము విక్రమశకము జ్యోతిర్విదాభరణమను జ్యోతిషగ్రంథ ప్రామాణ్యమున కలిశకము 3068, 3044 సంవత్సరములని వీరొనర్చిన సిద్ధాంతమను సరణీయము.

ఈ గ్రంథము రెండవ భాగమున పర్గీటరు వ్రాసిన కలిరాజ వంశములను గ్రంథమునగల దోసగులు, తదనుయాయులనదగు ప్రాచ్య పాశ్చాత్య రచయితల భారతదేశ చరిత్రముల దొరలిన దోసగులు విపులముగా జర్చింపబడినవి. ఈ నిర్ణయములబట్టి భారత చరిత్ర మరల

వ్రాయబడినగాని మనపూర్వచరిత్రము తద్విజ్ఞానము స్వచ్ఛముకానేరదు.
ఆంధ్రుల పూర్వస్థితి ఈ గ్రంథకర్తగారు నిరతిశయోక్తికముగ వెల్లడిం
చిరి. ఐతరేయమున పేర్కొనబడిన విశ్వామిత్ర శాపదగ్ధులయినవాని
సంతానము వారిలో నంధ్రులొకజాతి యని ఇదివరకను కొనెడివారు.
శాపమున బతితులయిన భ్రష్టులు ఆంధ్రులుకారు. యయాతి కొడుకగు
ననువు వంశమున పదహారవవాడగు రోమపాదున కాంధ్రనృపతి సమ
కాలికుడు. ఈ యనువువంశముననే బలియను రాజు కలిగెను. ఆతని
కుమారులు తండ్రి రాజ్యమును బంచికొనిరి. నాటినుండియు నంగ,
వంగ, కళింగ, సుంహ్మ, పుండ్రాంధ్రరాజ్యములు రాజనామమున వెలసిన
వని వీరు చెప్పినది యుక్తిసహముగాయున్నది. ఆంధ్రరాజు పాలన
మున గల రాజ్యమాంధ్రరాజ్యము. అందలి వారాంధ్రులు. కావున
నైతరేయ ప్రమాణముల లభ్యమగు నాటవికజాతి యంధ్రులనియు,
నాంధ్రులము మనమనియు, మన రాజాంధ్రనాముడనియు దన్మూలమున
మన జాతి యాంధ్రజాతియైనదనియు, నీజాతి దశరథునాటినుంటియు
రాజ్యము చేయుచున్న జాతియని వీరు చక్కగా ప్రతిపాదించినారు.
వీరిట్టి గ్రంథములనింకను వ్రాయ దైవము వీరికి బురుషాయుషముతో
బాటారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాక ! ఇత్యాది.



# తొలి పలుకు

*

సూర్యుడు సముద్రోదకమును త్రాగి సర్వప్రాణులకు హాయిని గూర్చు స్వచ్ఛ జలమును ప్రసాదించునట్లు శ్రీ కోట వెంకటాచలముగారు దురవగాహమైన ఆర్ష గ్రంథ జాతమును బహు శ్రమకోర్చి చిరకాలము పఠించి, దానిని జీర్ణింపఁజేసికొని మనకు సుబోధమై, అమృతోపమాన మైన వైజ్ఞానికాంశరాశి నందించుచున్నారు. ప్రదర్శన ప్రధానమైన యీ కాలములో పరిశోధకుడు దశాబ్దములు విజ్ఞానమును తనలోనే దాచుకొని, ఎప్పటికప్పుడు దానికి వన్నె కల్పించుకొనుచు, పరిపక్వస్థితి నొందించి తన వార్ధకమున పరిణత బుద్ధితో, ప్రతిభతో దానిని లోకుల కందించుటయరుదైన విషయము. ఈ లోకోత్తరమైనరీతిలో శ్రీ వెంకటా చలంగారు మన కందించుచున్న గ్రంథములలోనిది పంద్రెండవది.

కోట్లకొలది సంవత్సరములలో విస్తృతమైన భారతదేశ చరిత్రను పాశ్చాత్య పండితులు నాలుగువేల సంవత్సరములలో నిముడ్చుటకు ప్రయత్నించిరి. అనేక చరిత్ర గ్రంథములీరీతిగా బయలుదేరినవి. తత్ఫలి తముగా వేదములు నిన్న మొన్న కల్పింపబడిన గ్రంథములనియు, రామాయణ భారత కథలు జరుగనేలేదనియు, పురాణములు తప్పుల తడకలనియు మనవారు నమ్ముట సంభవించినది. పాశ్చాత్య విజ్ఞాన విలసితులైన భారతీయులును ఇట్టి గ్రంథములనే యెన్నింటినో రచించిరి. పాఠశాలలలో కూడ నీ చరిత్రలే బోధింపబడుటచే బాలురను గూడ నాస్తికత దృఢముగా నలముకొన్నది; మఱియు భారతీయ విజ్ఞానము పట్ల వారికి తప్పు భావములు కలిగినవి ఈ నాస్తిక్యాంధకారమును, దేశీయ విజ్ఞాన నిరసన భావమును పోఁగొట్టవలయునన్నచో విజ్ఞాన కిరణములను ప్రసరింపఁ జేయవలయునేకాని మఱొక మార్గము లేదు. ఇట్టి విజ్ఞాన కిరణముల ప్రసరింపఁజేసి భారతీయ ధర్మ విజ్ఞానములకు శాశ్వతోపకారము చేయు భాగ్యమెవ్వరికి దక్కునాయని చిరకాలము నుండి యెదురుచూచు చుంటిమి. అట్టి మహానుభావుడిపుడు బయలు దేరుట దేశీయుల భాగ్యము.

ఆర్య విజ్ఞాన పరిశోధనములో శ్రీ వెంకటాచలముగారు నూతన శకము నారంభించినారు. పెద్ద పెద్ద పేరులు గల చారిత్రకుల సిద్ధాంతములను టువ్వున మెగురగొట్టుటలో వీరి నేర్పరితనము మరొకరికి రాదు. వీరి సిద్ధాంతములు ఆర్య విజ్ఞానమందు "వెత్తి భక్తి" కలవారికి మాత్రమే కాక శ్రీ డా॥ భోగరాజు పట్టాభి శీతారామయ్యగారు (రాష్ట్రపతి), శశాప్రపూర్ణ శ్రీ చిలుకూరి నారాయణరావు పంతులుగారు ఎం. ఏ, పి. హెచ్.డి, యల్. టి., శ్రీ రాళ్ళబండి సుబ్బారావుపంతులుగారు యం.ఏ. యల్.టి.ఇయన్. రాజమండ్రి మున్నగు వారికిం గూడ నచ్చుచుండుట గమనింపదగిన విషయము.

శ్రీ వెంకటాచలముగార నేక గ్రంథములలో పురాణముల ప్రామాణికతను నిరూపించి యీ గ్రంథములో అగ్నివంశ రాజుల చరిత్రమును పురాణాధారముచే లిఖించిరి. శకహూణాదులు భారతావనిపై అత్యాచారము గావించుచుండిన కాలములో వారి నెదుర్కొనుటకై మంత్ర శక్తిచే కొందరు బ్రాహ్మణులు క్షాత్ర శక్తిని సంపాదించిరనియు, వారి వంశములే యగ్నివంశములని వ్యవహరింపబడుచు వచ్చినవనియు, క్రీస్తునకు పూర్వము 400 సంవత్సరములును, క్రీస్తునకు పిమ్మట 1200 సంవత్సరములును ఆ వంశములవారు భారతభూమిని సర్వ విధముల కాపాడిరనియు గ్రంథకర్తలు నిరూపించినారు. ఆ వంశములలోని యే యిద్దఱి ముగ్గురి నామములో తప్ప మిగిలినవి చరిత్ర గ్రంథములలో గన్పట్టవు. తద్వంశస్థులై, క్రీ. పూ. 57 వ సంవత్సరములో నూతన శకమును స్థాపించిన విక్రమాదిత్యుడును, క్రీ. శ. 78 లో వేరొక శక స్థాపన మొనర్చిన శాలివాహన చక్రవర్తియు కల్పితపురుషులని భావించు స్థితిలోనికి కూడ చారిత్రకులు వచ్చినారు. ఇట్టి యపోహలను పాఱద్రోలి యీ గ్రంథకర్తలు విక్రమాదిత్యాది మహామహుల యదార్థ చరిత్రలను మనకు కన్పఱచినారు. వైదేశికులను వీరెట్లు పారద్రోలినది, ఆర్య ధర్మము నెట్లు కాపాడినది స్పష్టముగా నిందు నిరూపింపఁబడినది. గ్రామ గ్రామమున దేవాలయమును, దేశ దేశమున యజ్ఞము, సర్వత్ర ఆర్ష ధర్మము సాధించిన యీ చిరస్మరణీయ శుభ నామధేయముల పవిత్ర చరిత్రను శ్రీ వెంకటాచలముగారు రమ్యముగా లిఖించినారు.

వేదవిదులై, యనుష్ఠానపరులై, మంత్రమహిమచే క్షాత్రశక్తిని సంపాదించిన బ్రాహ్మణులవంశమునందుద్భవించి రాజ్యపాలనము చేసినట్టియు వీరివలన ఉద్యోగములను పొందినట్టియు లక్షలకొలది బ్రాహ్మణులు భారతదేశమునందంతటను వ్యాపించినరీతిని ఈ గ్రంథకర్తలు నిరూపించి ఆంధ్రదేశమునందలి నియోగి కుటుంబములా బ్రాహ్మణవంశమువారేయని వ్రాయుచ్చినారు. ఉత్తరదేశములోని బ్రహ్మక్షత్రులనుగూర్చి శ్రీ వెంకటాచలముగారు చెప్పిన యంశములు స్మిత్ మున్నగు చారిత్రకుల యభిప్రాయములకు విరుద్ధములు కావు.

క్రీ॥ పూ॥ 3?7 నాటివాడుగా పాశ్చాత్యులచే నిర్ణయింపబడిన చంద్రగుప్తమౌర్యుడు క్రీస్తునకు 1534 సంవత్సరముల పూర్వపువాడని శ్రీ వెంకటాచలముగారు నిరూపించియున్నారు. చరిత్ర గ్రంథములపై గుడ్డినమ్మకముగల వారికిది దుస్సహాముగా నుండవచ్చును. కాని చంద్రగుప్తమౌర్యుడు క్రీ॥ పూ॥ 327 నాటివాడను సిద్ధాంతమును కాదనువారిలో ప్రముఖ చారిత్రకులే కొందరు కలరని మరువరాదు. అలెగ్జాండరును కలసికొనిన శాండ్రకోటస్ చంద్రగుప్తమౌర్యుడుకాడని యిదివఱకే కీ॥ శే॥ నడింపల్లి జగన్నాథరావుగారు మున్నగువారు నిరూపించియున్నారు. శ్రీ వెంకటాచలముగారీ గ్రంథములలో ప్రదర్శించిన యితర చారిత్రకాంశములనుకూడ చరిత్ర పరిశోధకులంగీకరించు సమయము వచ్చుచో నాశ్చర్యముండదు.

పురాణములను, ఇతర పురాతన సంస్కృతవాఙ్మయమును ఆధారముగా చేసికొని భారతీయేతిహాసమును పునర్నిర్మింపవలసిన యావశ్యకతను నేడనేకులు గుర్తించుచున్నారు. ఈ నిర్మాణమున శ్రీ వెంకటాచలముగారు పునాదిరాయి వైచుటయేకాక తరువాత పరిశోధకులు పోవలసినరీతిని స్ఫురింపజేయుటకు కట్టడమును కొంత లేవదీసినారు. ఆధునిక పద్ధతి చారిత్రకులును వీరి మార్గములోనికి క్రమముగా వచ్చుచునే యున్నారు. పురాణములలోగల గౌతమీపుత్ర శాతకర్ణి, గౌతమీపుత్ర యజ్ఞశ్రీ మున్నగువారి నామములు అభూతకల్పనలని చారిత్రకులు ఆదిలో భావించిరి. తరువాత నాసికప్రాంతములో దొరకిన నాణెముల

ఆధారముచే ఆ రాజపరంపర సత్యముగానే యుండినదని చారిత్రకులు నమ్మసాగిరి. ఈ రీతిగ పురాణముల ప్రామాణికత క్రమముగా గుర్తింపబడుచున్నది. ఇది పెరిగి, ముఖ్యముగా ప్రాచీన భారతీయ వాఙ్మయాధారము మీదనే భారతదేశ చరిత్ర లిఖింపఁబడు సమయము వచ్చునప్పుడు ఈ రంగమున (శ్రీ) వెంకటాచలముగారి కృషి దివ్యోపదేశమైన ఆద్యోచ్చారణముగా పరిగణింపబడగలదు. అంతవఱకు వేచియుండవలసిన దేనా? లేక ఆంధ్రులు తమ వీరులను కాలములో గుర్తింపరను నిందను పోగొట్టుకొనుటకై యీలోపుననే వారి నుచితరీతిని నాదరింతురా? చూడవలసియున్నది.

ఇట్లు,

విజయవాడ,
7-11-50

జటావల్లభుల పురుషోత్తము M. A.,
Lecturer in Sanskrit,
S. R. R, & C. V. R. College, Vijayawada



# పీ ఠి క

భారతయుద్ధము కలియుగమునకు పూర్వము 36 వ సం॥రములో జరిగెను. యుద్ధమందు జయించిన పాండవులలో జ్యేష్ఠుడైన ధర్మరాజు భారతచక్రవర్తిగా కలిపూర్వము 36 సం॥రములో (క్రీ॥ పూ. 3138 సం॥ అభిషేకింపబడెను. అయోధ్యారాజగు ఇక్ష్వాకువంశములోని బృహద్బలుడు అయోధ్యారాజుగాను సోమాధి లేక సోమాపి అనెడి జరాసంధుని వంశములోని రాజు మగధలోను అభిషేకింపబడిరి. కలి 1468 సం॥రమునకు (క్రీ॥ పూ. 1634) అయోధ్య రాజులలో ముప్పదవవాడు చివరి రాజు సుమిత్రుడును, హస్తినాపుర చక్రవర్తులలో యిరువదెనిమిదవవాడు కడపటి చక్రవర్తి క్షేమకుడును అపుత్రకులుగా గతించినందున మగధ రాజు బలవంతుడై చక్రవర్తియయ్యెను. భారతయుద్ధ సంవత్సరముననే పరీక్షిన్మహారాజు జననము.

శ్లో॥ "మహాపద్మాభి షేకాత్తు యావజ్జన్మ పరీక్షితః।
ఏకమేవ సహస్రంతు జ్ఞేయంపంచశతోత్తరం॥"

(మత్స్య పురాణం)

తా॥ పరీక్షితుని జననము మొదలు మహాపద్మనందుని పట్టాభిషేకమువరకు పదిహేనువందల సంవత్సరములని తెలియవలెను.

మహాపద్మ నందుడును ఆతని జ్యేష్ఠభార్య కుమారులైన సుమాల్యాదు లెనమండుగురును కలిసి నూఱుసంవత్సరములు రాజ్యము చేసి యుండిరి. అటుపిమ్మట "విష్ణుగుప్తుడు" అను పేరుగల "చాణక్యుడు" నందులు తొమ్మండుగురను సంహరించి మహాపద్మనంద యొక్క రెండవ భార్యయైన "ముర" అను నామెకు జనించిన కుమారుడు చంద్రగుప్త మౌర్యునికి కలి 1568 సం॥ (క్రీ॥పూ. 1534 సంవత్సరము) పట్టాభిషేక మొనర్చెను.

పాశ్చాత్య చరిత్రకారులు అలెగ్జాండరు దండయాత్రా కాలము క్రీ॥పూ. 327 సం॥రములో మగధ చక్రవర్తిగా నుండినది గుప్త చంద్రగుప్తుడని తెలియక మౌర్యచంద్రగుప్తుడుగా భ్రాంతి పడినందున భారత

రాజవంశావళి కాలములో మౌర్యచంద్రగుప్తుని కాలము క్రీ॥పూ. 1534 సం॥రముకు బదులు గుప్తచంద్రగుప్తుని కాలమైన క్రీ॥పూ. 327 సం॥రముగా యెంచబడినది. మౌర్య గుప్తవంశములమధ్య తేడా 1534—327= 1207 సం॥రములు కాలము భారత కలిరాజ వంశావళి జకాలములో తరుగు వచ్చి యున్నది. (ఈ విషయము వివరముగా యీ గ్రంథకర్త గారిచే వ్రాయబడిన కలిశకవిజ్ఞానం 2, 3 భాగములలో విచారింపబడినది. చూడుడు) మౌర్యవంశము 316 సం॥రములు అనగా కలి. 1568—1984 వరకు (క్రీ॥పూ. 1534—1218 సం॥ వరకు) పరిపాలించెను.

అటుపిమ్మట రాజ్యమునకువచ్చిన "శుంగ" వంశపురాజులు కాణ్వరాజులు, ఆంధ్ర శాతవాహన రాజులు బ్రాహ్మణులు. శుంగ వంశమువారు. "సామవేద" శాఖకు చెందిన బ్రాహ్మణులు. కాణ్వ వంశమువారు "శుక్లయజుర్వేద" శాఖీయులు. ఆంధ్రశాతవాహన వంశమువారు "కృష్ణయజుశ్శాఖ"కు చెందిన బ్రాహ్మణులు. ఈ మూడు వంశములలో జ్యేష్ఠకుమారులు రాజ్యములకురాగా మిగిలిన రాజకుమారులును, రాజుల దౌహిత్రులును (కూతురుకొడుకులు) రాజులుగా చేయబడి రాజపుటానాలో అల్పరాజ్యము లీయబడినవి. రాజపుటానాలోని రాజవంశీయులకు "రాజపుత్రులు" అని పేరు. "రాజపుత్రు"లనగా రాజుకుమాళ్ళు అని అర్థము.

ఆంధ్ర శాతవాహనవంశపు చివర రాజులకాలములో సామ్రాజ్యము విచ్ఛిన్నముకాజొచ్చినది. సామంతరాజులు క్రమ క్రమముగా స్వతంత్రులగుచు వచ్చిరి. రాజవంశీయులలో చేరిన రాజబంధువులు రాష్ట్రపాలకులుగానుండినవారు స్వతంత్రరాష్ట్రముల రాజులుగా ప్రకటించుకొనిరి. రాజపుటానాలోని "రాజపుత్రులు" స్వతంత్రులగుటయే గాక తమ చుట్టుప్రక్కలగల సామ్రాజ్యభాగములను తమ రాష్ట్రములలో కలుపుకొనజొచ్చిరి. మగధచక్రవర్తుల కుటుంబీకులు సామ్రాజ్యమును ఖండ ఖండములుగా జేసి పంచుకొనిరి. ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము (అయిదు + ఏడు = ) పండ్రెండుశాఖలుగా చీలిపోవునని పురాణములు చెప్పుచున్నవి. ఆంధ్రులు తమ జాతియైక్యతను గోల్పోయి

ఆసేతుహిమాలయముగాగల తమ సామ్రాజ్యమును ముక్కలుచేసి పంచుకుని యెవరికివారు స్వతంత్రులై అల్పరాజ్యముల నేలుచుండిరి. ఇట్టి స్థితిలో శక, యవన, హూణ, పహ్లవ మొదలగు దోపిడిమూకలు దేశములోనికి జొచ్చుకొనివచ్చి పట్టణములను, పల్లెలను కొల్లగొట్టుచు, స్త్రీ బాలాదుల వధించుచు స్త్రీల నెత్తుకొనిపోవుచుండిరి. ఎవరికివారు స్వతంత్రులై అల్పరాజ్యములను పాలించుచుండిన రాజులీమ్లేచ్ఛ దండ యాత్రల నాపలేకుండిరి. ఇట్టి స్థితిలో దేశములోని ప్రజలు, పీఠ స్వాములు దేశసంరక్షణార్థము "జపుటానాలోగల రాజకుటుంబముల నుండి సమర్థులై, వేదాధ్యయన సంపన్నులై, ధర్మబుద్ధులైన బ్రాహ్మణు లను నలుగురిని యేర్పరచుకొని వారియందు క్షాత్రతేజము నిల్పునట్లు, సంకల్పించి వారిచేత రాజపుటానాలోగల "అర్బుద" పర్వతముమీద (ఆబూపర్వతమని యిప్పటిపేరు) యజ్ఞవేదిక కల్పించి కలి 2710 సం॥ (క్రీ॥ పూ॥ 392 సం॥) అగ్నియందు హోమాదులను చేయించిరి వీరికి అగ్నికులులని, బ్రహ్మక్షత్రులని, అగ్నివంశపు రాజులని పేరిడిరి. వీరికే ఆంధ్రదేశములో "నియోగ బ్రాహ్మణ ప్రభువు"లనిపేరు. ఆనలుగురిలో 1 ప్రమరుడు. ఈతడు సామవేది. ఆంధ్రుడు 2. చపహాని లేక వయ హాని యజుశ్శాఖకు చెందినవాడు. 3. శుక్లుడు, ఋక్శాఖీయుడు, 4. పరిహారకుడు అథర్వణవేది ఈతడు దక్షిణదేశీయుడు – కర్నాటకు డని కొందరును, ఆంధ్రుడని కొందరును యెంచిరి. వీరు నలుగురును ఆంధ్రులేననియు ఆంధ్ర శాతవాహనవంశములోనివారనియు హెచ్చు మంది తలచుచున్నారు. "ప్రమరశ్చమహీపాలో దక్షిణాందిశ మాస్థితః" ప్రమరునికి పశ్చిమ మాల్వా అని పిలువబడు అవంతిమండలమునగల ఉజ్జయినియందుండి దక్షిణముగా సేతువువఱకుగల రాజ్యభాగమీయ బడినది. అందలి అల్పరాజ్య ప్రభువులాతనికి సామంతులుగా చేయబడిరి.

"రాజపుత్రాఖ్యదేశేచ, చపహా నిర్మహీపతిః" చపహాని ప్రభు వుకు రాజపుత్రస్థానములో "అజ్మీరు" రాజధానిగా పంజాబు పశ్చిమోత్తర రాష్ట్రములుగల భాగమీయబడి అందలి అల్పరాజన్యులాతనికి సామం తులుగా చేయబడిరి.

"శుక్లో నామ మహీపాలో గత ఆనర్తమండలే" శుక్ల మహా రాజుకు ఆనర్తమండలమున ద్వారకానగరము రాజధానిగా పశ్చిమభారత మీయబడి అందలి అల్పరాజన్యులాతనికి సామంతులుగా జేయబడిరి.

"చిత్రకూటగిరేర్దేశే పరిహారో మహీపతిః" పరిహార మహా రాజుకు చిత్రకూట గిరిగలదేశమునగల "కలింజరపురము" రాజధానిగా వంగాదిగాగల తూర్పు భారతభాగ మీయబడి అందలి అల్పరాజన్యు లాతనికి సామంతులుగా జేయబడిరి

ప్రారంభదశలో యీ రాజు లెక్కువబలవంతులుగా లేకపోయిరి. సామంతులుగా జేయబడినవారు వీరికి లోబడియున్నట్లుగాని శకాదుల నెదుర్కొనుటలో వీరికి సాయముచేసినట్లుగాని కనుపడదు. కలి మువ్వ దవ శతాబ్దాంతము వఱకువీరుసామాన్యముగానే యుండిరిగానిప్రబలులుగా లేరు. ఈ లోపల కలి 2775 సం॥రములో ఆంధ్రశాతవాహన వంశమున చివర రాజుమైనరు చంద్రశ్రీ చంపబడుటయు గుప్తచంద్రగుప్తుడు రాజగుటయు, ఆకాలముననే అలెగ్జాండరు దండయాత్ర వచ్చుటయు జరిగి యున్నది అటుపిమ్మట గుప్తరాజులలో రెండవవాడు "సముద్ర గుప్తుడు" దేశమంతయు జయించుటకు దండయాత్ర జరిపి చక్రవర్తియై యుండగా పై నలుగురు బ్రహ్మక్షత్రరాజులు ఆతనికి లోబడియుండిరి. కలి 3020 సం॥ (క్రీ॥పూ. 82 సం॥)రముతో గుప్తవంశ మంతరించినది. అట్టికాలమున యీ యగ్నివంశపురాజులు నలుగురును ప్రబలులై ఆసేతు హిమాచలముగాగల రాజ్యము నంతను లోబరచుకొని యావద్భారత దేశమును ధర్మయుక్తముగా పరిపాలించిరి. శకాదిదోపిడి గాండ్రు సింధునదిని దాటిరాకుండునట్లు కట్టుదిట్టమొనర్చిరి, సింధునదికి పడమటగల దేశమంతయు భారతయుద్ధమునకు పూర్వమునుండియు వైదికధర్మమును విడిచి దస్యులైన క్షత్రియులు శకయవన, హూణ, పహ్లవాది రాజులచే పరిపాలింపబడు చుండినది. అచటిప్రజలందరు వైదిక ధర్మమునువీడి దస్యులైనవారేయై యుండిరి.

అగ్నివంశపు రాజుల చరిత్ర మరుగుపరచబడినది గాని, ఆమూలా గ్రముగా మనకు ప్రకాశింప జేయబడలేదు. ఈ రాజులు క్రీస్తు శకము

నకు పూర్వ మొకటవ శతాబ్దము లగాయతు క్రీ॥ శ. పండ్రెండవ శతాబ్దమువరకు ప్రబలులుగా నుండి రాజ్యములు చేసియుండిరి. మహమ్మదు గోరీతో జరిగిన స్థానేశ్వర యుద్ధములో వారి నెదిరించి వీరోచితముగా పోరాడి నసువులను బాసిన పృథ్వీరాజాదు లీ అగ్నివంశపు రాజులై యున్నారు. వీరు అగ్నివంశపు రాజులని, పురాణమున చెప్పబడిరి. బ్రహ్మక్షత్ర రాజులని ఉత్తర దేశమునను, రాజపుటానా, మాల్వా, పంజాబు రాష్ట్రములలోను పేరు. వంగదేశమున శాక్తేయ బ్రాహ్మణులని నేటికిని పిలచెదరు. వీరినే రాజ్యములు చేసిన ఆంధ్ర బ్రాహ్మణులలో "నియోగ బ్రాహ్మణ ప్రభువు"లని పిలచెడివారు. ఇటీవల వీరు నియోగ ప్రభువులని కొంత కాలమును రాజ్యము, రాజ్యాధికారము, రాజోద్యోగములు పోయిన కాలమున నియోగ శాఖీయులని, బ్రాహ్మణులలో నొక యుపశాఖగా యెంచబడుచుండిరి వీరలు దేశము బౌద్ధులచే నావరింబడి, శక హూణాదుల దండయాత్రలచే క్షోభము నొందుచుండిన కాలమున దేశప్రజల సంరక్షణమునకును, వైదిక ధర్మ రక్షణమునకును "ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర"మనెడి న్యాయము ననుసరించి ఆయుధ ధారులై తమ బ్రహ్మతేజమును క్షాత్రమందనుసంధించి "ధర్మసంస్థాపన" చేయగలందులకు నియోగింపబడిన వేదపారంగతులైన వైదిక బ్రాహ్మణులై యుండిరి. ఆ కాలమున అట్టి యుద్యమము జరుపబడక యుండినగాని, బ్రాహ్మణులు ధర్మసంరక్షణార్థము ఖడ్గధారులు కాక యుండినగాని భారతదేశమున వైదిక ధర్మము, వేద శాస్త్రాధ్యయనాదులేనాడో నాశనమైపోయి మన మీనాడు మ్లేచ్ఛ కోటిలో చేరి యుండెడివారము.

మహానుభావులైన అట్టి అగ్నివంశపురాజులు లేక బ్రహ్మక్షత్ర రాజులు, లేక నియోగబ్రాహ్మణ ప్రభువుల చరిత్ర ఆమూలాగ్రముగా పురాణములనుండి యుద్ధరింపబడి యిందు కూర్చబడినది. అగ్నివంశపు రాజులలో మొదటివాడైన ప్రమరుని వంశములో "విక్రమాదిత్య" కలి 3001 సం॥ (క్రీ॥ పూ॥ 101 సం॥రము)లో జన్మించి కలి 3020 సం॥రములో (క్రీ॥ పూ॥ 82 సం॥) ఉజ్జయినీయందు పట్టాభిషిక్తుడయ్యెను. కలి 3044 సం॥ క్రీ॥ పూ॥ 57 సం॥రములో విక్రమ శకస్థాపన చేసి

యుండెను. ఈత డాసేతుహిమాచలముగాగల దేశమంతటిని జయించి చక్రవర్తియయ్యెను. శకాదులను నాశనముచేసి యీ దేశమున లేకుండు నట్లు వెడలనడిచెను. ఈతనికి పిమ్మట కలి 3179 సం॥ (క్రీ॥ శ॥ 78 సం॥) రములో ఈతని మనుమడు "శాలివాహనుడు భారతదేశ చక్రవర్తియగు టయేగాక శాలివాహనశకమును స్థాపించియుండెను.

శకకర్తలైన విక్రమార్క, శాలివాహనులసలే పుట్టలేదనియు, ఆ శకములు కానిష్కుడు మొదలుగాగల శకరాజులవనియు పాశ్చాత్య చరిత్రకారులు భారతదేశ చరిత్రలో వ్రాసియుండిరి. ఈ అగ్నివంశముల చరిత్ర మనకందకుండులాగున మరుగుపరచబడినది. అసత్య చరిత్రలు వ్రాయబడి మనకు పాఠశాలలో పాఠ్యగ్రంథములుగా నొనర్చబడినవి. పల్లవ, చాళుక్య, సేన, చేత, కదంబ, రాష్ట్రకూట, విష్ణుకుండిన, బృహత్ఫలాయన, బాణ, గాంగ, హోసల, రాజపుత్ర, శాలంకాయన, వాకటక, వల్లభి, వైదుంబ, నోలంబాదిశాఖలన్నియు యీ అగ్నివంశపు రాజులనుండియు, శాతవాహన, కాణ్వ, శుంగరాజ వంశములనుండియు, యేర్పడిన అంతశ్శాఖలైన బ్రాహ్మణవంశమువారు. ఈ బ్రాహ్మణరాజులు వారి సంతానము, వారి బ్రాహ్మణ రాజకీయోద్యోగులు మొత్తం అరువది లక్షలుగానైనట్లు భవిష్య పురాణము 3-3-4-6 7 లో చెప్ప బడినది. వీరు బలవంతులై ఆసేతుహిమాలయముగాగల భారతదేశమును పాలించిరి. ఈ విషయము యీ గ్రంథకర్తగారిచే వ్రాయబడిన కలిశక విజ్ఞాన ద్వితీయ, తృతీయభాగములలో విపులముగా చర్చింపబడినది. అగ్నివంశపురాజుల యుత్పత్తి లగాయతు పురాణములో చెప్పబడిన చరిత్ర ఈ గ్రంథమున సవిస్తరముగా కీర్తింపబడును. ఇందలి రాజవంశావళుల జాబితా ననుసరించి యీ గ్రంథకర్తచే వ్రాయబడిన కలిశక విజ్ఞానములోని తృతీయభాగమునగల రాజుల జాబితా సవరించుకొన ప్రార్థన.

గాంధినగరం,
విజయవాడ.
15-11-50

కోట వెంకటాచలం,
గ్రంథకర్త.

ఓ మ్

ఆర్యావర్తః పుణ్యభూమిః

# అగ్నివంశపు రాజులు

## శ్రీ భవిష్య మహాపురాణము

అగ్నివంశపు రాజులచరిత్ర ఆమూలాగ్రముగా శ్రీ భవిష్య మహాపురాణములో వర్ణితమైనది. భవిష్య మహాపురాణము నాలుగు పర్వములుగా విభక్తమైయున్నది. అందు 1. బ్రాహ్మపర్వము, 2. మధ్యమ పర్వము, 3, ప్రతిసర్గపర్వము, 4. ఉత్తర పర్వము. అందు తృతీయమగు ప్రతిసర్గ పర్వమున వైవస్వత మన్వంతరమున రాబడిన ఇరువదెనిమిదవ మహాయుగ ప్రారంభమునుండి కృతత్రేత ద్వాపర యుగములలో రాబడిన ప్రముఖ రాజవంశావళులనుచెప్పి యీ ఇరువ దెనిమిదవ కలియుగ ప్రారంభమ్మునుండి కలి 4295 (క్రీ॥ శ. 1193 సం॥) రమున ధానేశ్వరమున పృథ్వీరాజు, మహమ్మదు గోరీలకు జరిగిన కురుక్షేత్ర సంగ్రామమువరకు రాజవంశావళులను వర్ణించి యున్నది. అట్టి రాజవంశావళులలో కలి 2710 సం॥రమున స్థాపింపబడిన అగ్ని వంశపురాజులు చరిత్ర పూర్తిగావర్ణింపబడినది. అట్టి అగ్నివంశపు రాజుల చరిత్ర పాశ్చాత్య పండితులచే వ్రాయబడిన చరిత్రలలో నెచ్చటను చెప్పబడి యుండలేదు. ఆవంశముల రాజులలో పేరునకు ఏ యొకరిద్దరో రాజులు విధిలేక చెప్పవలసినచోట్ల స్మరింపబడిరేగాని ఆ రాజవంశా వళులు నాలుగును వరుస క్రమమున నెచ్చటను వర్ణింపబడి యుండ లేదు. అందు ముఖ్యులై శకకర్తలైన శ్రీ విక్రమాదిత్య శాలివాహను లసలే పుట్టియుండలేదని అసత్య ప్రచారము చేయబడినది. భారతీయ చరిత్రకారులును పాశ్చాత్య చరిత్రకారుల ననుసరించిరేగాని తమ పౌరాణిక వాఙ్మయమును పరిశోధించినవారు కారైరి. అందువలన మనకు నేటివరకును మన పాశ్చాత్య చరిత్రకారులచే వ్రాయబడిన అసత్య చరిత్రలే పాఠ్యగ్రంథములై యుండవలసి వచ్చినది.

భారతదేశములోని పురాణేతిహాసములు సంపూర్ణ భారత చరిత్రలై యున్నవి. అందు సృష్ట్యాదినుండి రాబడిన ఆరుగురు మనువుల కాలములలో జరిగిన ప్రాముఖ్య విషయములలో కొన్ని సంక్షేపముగా నీయబడినవి. ఇప్పటి ఏడవమనువు కాలములో జరిగిన యిరువదెనిమిది మహాయుగములలోగల ప్రముఖ రాజవంశముల నిచ్చుచు అతి ప్రాముఖ్య విషయములను వర్ణింపుచు ఆ కాలమునాటి ప్రజల ఆచారములు, నడవళ్ళు రాజులరాజ్యపాలనాదులు ప్రజలనీతి నియమములు నాగరికత సంక్షిప్తముగా వర్ణింపబడినవి. కేవలరాజుల చరిత్రతో ముగింపక వారి కాలములోని ప్రజల చరిత్రకూడను పురాణములయందు చెప్పబడినది. కోట్లకొలదిగాగల సంవత్సరములలో జరిగిన చరిత్రలను వ్రాసి కాపాడుట సాధ్యముకానిపని యని అందరెరింగినదేగదా! ఇరువది యైదువందల సంవత్సరము కిటీవల వ్రాయబడిన గ్రీసుదేశ చరిత్రలే కాపాడబడి యుండలేదు. అలెగ్జాండరును గురించి వ్రాయబడిన సుమారు యిరువదికంటె నెక్కుడగు చరిత్ర గ్రంథములు నశించిపోయినవన ఇప్పుడు జరుగుచుండిన యిరువదెనిమిదవ మహాయుగమున కృత యుగమునుండి జరిగిపోయిన 38,93,000 ముప్పదియెనిమిది లక్షల తొంబదిమూడువేల సంవత్సరముల చరిత్ర వ్రాయబడి కాపాడబడుటెటు? కృత, త్రేతలను వదలినను ఎనిమిది లక్షల అరువది నాలుగువేల సంవత్సరములు కాలముగాగల ద్వాపరయుగ చరిత్ర వ్రాయబడి కాపాడబడుట సాధ్యమా? పాశ్చాత్యులు రెండువేల సంవత్సరముల క్రిందటి తమ చరిత్రలను సంపూర్ణముగా పోగొట్టుకొని యుండగా నూటతొంబది ఆరుకోట్ల సంవత్సరములనుండి జరుగుచుండిన భారతచరిత్ర సంపూర్ణముగా కాపాడబడుటెట్లు పొసగును? అయినను భారతీయ ఋషులు తమ బుద్ధిబలముచే కోట్లకొలది సంవత్సరములుగాగల చరిత్రను క్లుప్తముగానైనను కాపాడ గలిగినందుకు మనము వారికి కృతజ్ఞులమై యుండక తప్పదు. ప్రథమమనువుకాలములోని దేవ, మానవ, జంతు, వృక్షాదిసృష్టులు ఆకాలమునాడు జరిగిన కొన్ని ప్రాముఖ్య విషయములు మనకు అప్పటిమానవులు, అప్పటి రాజవంశావళి, ఆకాలము

నాటి ఆచారములు, మనకు మహర్షులు కాపాడి ఆ పురాణములలో నిచ్చియుండిరి. మిగత 2,3,4,5,6 మన్వంతరములలో జరిగిన వానిలో అల్పవిషయములు మాత్రమే మనకు మిగిలినవిగాని ఆ యాకాలముల లోని సృష్టివిధానములు మొదలైనవన్నియు మన కందియుండలేదు. ఆ చరిత్రలన్నియు పూర్తిగా నశించి యుండవచ్చును. ఇప్పుడు జరుగు చుండిన యిరువదెనిమిదవ మహాయుగములోని ద్వాపరయుగాంత చరిత్ర భారత యుద్ధముపరకు మనకు పూర్తిగా అందియున్నది.

మహాభారత యుద్ధము కలి పూర్వము 36 సం॥ (క్రీ॥ పూ. 3138 సం॥) నము లగాయితు రాజ వంశావళులు మనకు పూర్తిగా లభించు చున్నవి. అందు కొన్ని రాజ వంశావళులను పాశ్చాత్య పండితులు వాటి రాజ్యకాలములతో సహా గ్రహించిరి. కొన్నిటి కాలములను తగ్గించిరి. కొన్ని రాజవంశావళు లసలే తీసుకొనబడలేదు. కొన్నిటిని తారుమారుచేసి కాల వ్యత్యస్తములను కలుగజేసి వాటిని విమర్శించు వారిలాగున గొప్ప గొప్ప విమర్శనలు గావించి తమ చరిత్రలలో వందల కొలది పుటలను తమ యసందర్భ, యసత్య విచారణలతో నింపి భారత తీయ విద్యార్థుల విమోహితుల గావించిరి. వీరి విమర్శనములు పనికి మాలిన అల్ప విషయములను తీసికొని తమ కుతర్కములతో గ్రంథము లను పెంచి తమకు తోచిన యేదియో యొక నిర్ణయమునకు వచ్చి నటుల నటించుచూ రాగల కాలమున బుద్ధిమంతు లాక్షేపించుటకు వీలు లేకుండులాగున అట్లు కావచ్చును, ఇట్లు నమ్మవచ్చును, ఆ విధముగా నూహింపవచ్చును అను మొదలుగాగల వాక్యములను చాటుచేసుకొని చరిత్రలను వ్రాసియుండిరి. వారిచే చేయబడుచున్న నిర్ణయము పూహా మాత్రమే గానిసత్యము, స్థిరము కాదని వారి వాక్యములే చెప్పుచున్నవి. ఇట్టి స్థితిలో వారిచే చేయబడిన యూహలను సత్యమని నమ్ముచుండిన మనదే పొరబాటుగాని వారి తప్పేమియు నున్నటుల కనుపించుట లేదు.

పూర్వ చరిత్రాధారములు లేని నవీన చరిత్రలు ఊహా కల్పిత ములు. వాటిని వాస్తవములని యంగీకరించుటకు వీలులేదు. ఇట్టి స్థితిలో ఐదువేల సంవత్సరములనాడు మహర్షి ప్రోక్తములైన పురాణ

ములు నిన్న మొన్నటివని తేదీలను నిర్ణయించుటకు వీరికి యధికార మేమిగలదు? ఆ తేదీలను నిర్ణయించెడి కార్యక్రమమునకు పూర్వ చరిత్రాధారము లేవి? వీరి నిర్ణయము లన్నియు వీరి యూహా కల్పిత ములై యున్నవి. వాటికెట్టి ఆధారములు లేవు. ఇట్టి స్థితిలో కలి ప్రవేశ మైన సంవత్సరమే "జయ" యను పేరున భారత రచన ప్రారంభించి మూడు సంవత్సరములలో ముగించితినని శ్రీ వేదవ్యాస భగవానుడు శ్రీ మహాభారతమున వ్రాసియుండగా దానిని కాదనుటకు వీరికే యాధా రములు గలవు? అయిదు వేల సంవత్సరములనాటి భారత రచనా కాల మును ఋజువు పరచుటకు ఇతర దేశముల నుండి సమకాలికాభి ప్రాయము లెట్లు రాగలవు? ఆనాటి కితర దేశములు పశుప్రాయులగు మానవుచే నిండియుండినవని చెప్పుచుండిన పాశ్చాత్య పండితులకు సమ కాలికాభిప్రాయములు ఎట్లు దొరకగలవు? ఒక చారిత్రకాంశమును ఋజువుపరచుటకు శాసనములు నాణెములు కావలయునని ప్రతివిషయము శాసనములలో వ్రాయబడు చుండునా? ఒక దానమిచ్చు సందర్భమున శాసనము వ్రాయబడినట్లు, ఒక రాజు తన జయములను శాశ్వతముగా లోకములో నుండులాగున యే కొండ గుహాలోనో వ్రాసి యుంచినట్లు రాజులందరు చేసియుండిరా? శాసనముల సాక్ష్యము లేని చరిత్రాంశ ముల నంగీకరింపంకుడుటకు వీరికేమి ప్రమాణము గలదు? పురాణముల యందెన్నడో వ్రాయబడిన చరిత్రాంశములను కాదనుటకంతకంటె ప్రాచీన చరిత్రలను వీరేమి చూపగలరు? వీరి యూహాలే చారిత్రకాంశ ములను నిర్ణయించుటకు ప్రమాణమైన యెడల ప్రాచీనుల యూహా లెందుకు ప్రమాణముగా నంగీకరించకూడదు?

హేతుశూన్యములైన కుతర్కములను ప్రయోగించి అమాయకు లగు భారతీయవిద్యార్థులకు నమ్మకము గలుగునట్లు చేసి తమ యూహా పోహాలతో వ్రాయబడిన చరిత్రలను పేరుగల కల్పనాకథలను వారికి నేర్పించిరి. పాశ్చాత్యగురువులు పురాణములన్నియు తప్పులతడికలని, కల్పనాకథలని, అందనేక ప్రక్షిప్తములు గలవని బోధించి వాటియందు భారతీయవిద్యార్థులకు హేయభావమును కలిగించినందువలన వారు

వాటిని చూడకుండుటకు హేతువైనది. భారతదేశచరిత్ర వ్రాయుటకు పాశ్చాత్య పండితులకు భారతదేశములోని పురాణములు తప్ప వేరు గత్యంతరము లేనందున వారు వానిని దీసుకొని తమ చరిత్ర గ్రంథములను నింపియు, పురాణములు తప్పులని ప్రచారముచేసి భారతీయులకు వాటియందు నిర్లక్ష్యభావము గలుగునటులొనర్చిరి. అట్టి నిర్లక్ష్య భావముతో తమ గ్రంథములను చూడక యుపేక్షించి పాశ్చాత్యుల చరిత్రలనే పఠించి పరిశోధకులనుపేరున వాటినే తిరిగితిరిగి వ్రాయుచుండిరి.

## శకములు తారుమారొనర్చబడుట

కలి 271 సం॥ (క్రీ॥పూ. 2902 సం॥)రమున యేర్పడిన అగ్నివంశములు నాలుగింటిలో ప్రముఖులైన రాజులు ప్రమరవంశములోని విక్రమాదిత్య శాలివాహన, భోజరాజులును, చయుహానివంశములోని పృధ్వీరాజును ఆంధ్ర, మహారాష్ట్ర దేశాదులను పాలించిన శుక్ల లేక చాళుక్య వంశపురాజులును గలరు. తూర్పుచాళుక్య, పశ్చిమచాళుక్య రాజులువారి రాజ్యవిస్తారములు, యిప్పటిచరిత్రలలో వర్ణితములై యున్నవిగాని వారి యుత్పత్తికి సంబంధించిన వివరములు ప్రారంభము నుండి వారివంశావళులు స్మరింపబడి యుండలేదు. మధ్యలో నెచ్చటనో ప్రారంభింపబడి అచ్చటచ్చటగల కొన్ని అల్పవిషయములు వారి చరితలో చెప్పబడినవి. బాహుమాన లేక చయుహాని వంశపురాజులలో కడపటి రాజుపృధ్వీరాజు, భవిష్య మహాపురాణములో 32 అధ్యాయము లలో వర్ణింపబడిన ఆతనిచరిత్ర క్లుప్తముగా చెప్పబడినది. అగ్నివంశములు నాలుగింటిలో నొకటగు ప్రమరవంశములో జన్మించి అగ్నివంశములు నాలుగింట కత్యంత గౌరమునుగూర్చి శకాది పరదేశీయుల పీచమడిచి, ఆసేతుహిమాచలముగాగల దేశమును జయించి శకకర్తలైన "విక్రమాదిత్య" "శాలివాహన" చక్రవర్తుల చరిత్ర స్మరింపబడకపోగా అట్టి పేర్లుగల రాజులసలే లేరనియు, ఆ శకములు శక కుషానురాజులకు సంబంధించినవై యుండవచ్చుననియు పాశ్చాత్య పండితులూహించి సందిగ్ధ

వాక్యములతో చెప్పియుండగా దానినే మనవారలు సత్యమైన నిర్ణయముగా నెంచి తమ చరిత్రలో వ్రాసుకొను చుండిది.

"To Azes I has been attributted the foundation of the vikrama Era in 58 B. C"

(Cambridge Hist. of India vol I, Ancient India By E. J. Rapson M. A. Ed. 1922 P. 571.)

తా॥ క్రీ॥ పూర్వం 58 సంవత్సరముల నుండి లెక్కింపబడు చుండిన విక్రమశకము యొక్క ప్రారంభము "మొదటి ఏజెస్" అనెడి పార్థియన్ రాజుదిగా ఆరోపింపబడుచున్నది. అని రాప్సన్ మహాశయుడు వ్రాయుచున్నాడు. కాని దానిని తానే సందేహించుచు ఆ శాసనమును వేసినవారు "ఏజెన్సు" అను రాజొకడున్నట్లు యెరుగనివారని చెప్పు చున్నాడు ఆతడింకను యిట్లు వ్రాసియున్నాడు. పశ్చిమోత్తర భారతములోను, పంజాబులోను మొదట రాజ్యములను స్థాపించి పరిపాలించిన శక రాజును 1. మాన్ (Maues) 2. మొదట ఎజెస్ (Azes I) 3. ఎజిలైజస్ (Azilises) అనువారలై "మాన్" మొదటిరాజు క్రీ॥ పూర్వం 120 సంవత్సరం అని చెప్పుచుండిరి గాని అది పొరబాటు అది క్రీ॥ పూర్వం 88 కావచ్చును.

క్రీ॥ పూర్వం 150 సంవత్సరములో "సెయిస్థాన్" అనగా శాకస్థానము పార్థియన్ సామ్రాజ్యములో "మొదటి మిత్రాడేట్సు" వలన చేర్చబడినది. "మాన్" యొక్క శాసనములో 78 అని వేయబడి యున్నది. అది ఇండియాలోని యే శకమునకు సంబంధించినది కాదు. అది సైస్థానులో (శాకస్థానములో) యుపయోగించెడి శకము కావచ్చును అని సందేహించుచూ చెప్పి ఆ పైవాక్యములో దానిని స్థిరపరచు ధోరణిలో అటులైన మొదటి మిత్రాడేట్సు తన సామ్రాజ్యమును విస్తరింపజేసిన క్రీ॥పూ. 150 సం॥రములో నుండి 78 తీసివేసిన క్రీ॥పూ. 72 వచ్చును. ఇది "మాన్" పరిపాలనా కాలములోని సం॥రము అని యూహాలపై యూహాలుచేసి దానిని స్థిరమైనదానిగా చరిత్రను నింపి యున్నారు.

(Cambridge His. of India vol I. By E. J. Rapson M. A. Ed. 1922. P. 570)

ఇకను "విమకాడ్ పాసిన్" కాలము నిర్ణయించుటకు యిట్లూహా గానము చేయబడినది. "తక్షశిల"లోని "చీర్‌టోప్" (Chir Tope)లో సర్. జాన్ మార్షలుకు దొరకిన శాసనమును బట్టి నిర్ణయించవచ్చును. ఈ శాసనం ఖరోష్ట్రి లిపిలో నున్నది. అందు 136 సం॥రము ఆషాఢ శుద్ధ పంచమి (5) అని వేయబడినది. అందుల శకం క్రీ॥ పూ. 58 లో ప్రారంభింపబడిన శకమని యెంచిన యీ తేదీ క్రీ॥ శ. 77 – 78 కావచ్చును. అనగా "విమకాడ్ పాసిన్" పరిపాలనలో ఆఖరు సం॥ రము అగును. కానిష్కుడు క్రీ॥ శ. 78 సం॥ రములో సింహాసనమునకు వచ్చి నట్లు నిర్ణయించుచున్న పండితుల వాదమునకిది సరిపోవును అని యూహా గానము చేసియున్నాడు.

సర్ జాన్ మార్షల్ అభిప్రాయమును బట్టి యీ శాసనము "మొదటి ఎజెస్" అను రాజు కాలమున వేయబడినదని దృఢపడు చున్నది". అని తన ఊహాగానమునుస్థిరపరచుకొనుచున్నాడు. ఖరో ష్ట్రిలో (Azoy) అను పదముకు సమానమైన గ్రీకుపదము "ఎజస్" (Azes) అగును. కాబట్టి ఆ శాసనమిట్లు చదువబడినది.

"In the year 136 of Azes" అని "మార్షల్" నిర్ణయించు చున్నాడు. ఇది సరియైనది కావచ్చును. అట్లైన "విక్రమ" శకమని పిలువబడు శకము "మొదటి ఎజస్" (Azes 1) రాజ్యమునకు వచ్చిన క్రీ॥పూ. 58 సం॥రం అగును. అయితే యిచ్చట నొకసంశయము కలుగు చున్నది. ఆశాసనమును వేసినవారు "మొదటి ఎజెస్"ను యెఱుగరని జ్ఞాపక ముంచుకొనవలసి యున్నది.

ఇదిగాక శాసనములోని "అయసా" (Ayasa) అను మాటకు "ఎజస్" అని అర్థము చేయబడినది. దీనికింకొక అర్థము చేయబడిన యిది తప్పవచ్చును.

అప్పుడు "తక్షశిల"లో రాజ్యము చేయుచుండినరాజు ఆ శాస నములో యిట్లు వర్ణింపబడినాడు. Great King, Supreme King of Kings, son of the Gods, the Khana (Kushana)"

అని గలదు. అనగా "గొప్పరాజు, చక్రవర్తి, దేవతల కుమారుడు, కుషానుడు". ఆరాజు పేరందీయబడక పోయినను అది "విమకాడ్ పాసిస్" శాసనమని చెప్పుటకు తగిన పూర్తి సాక్ష్యముగలదు. ఇతను కుషానురాజులలో రెండవవాడు. ఆతని నాణెములమీద మామూలుగా వుండెడి త్రిశూలము, నంది, ఆశాసనముల చివర వేయబడినవి.

క్రీ॥ శ. 78 సం॥రమున కుషానురాజైన "విమకాడ్ఫిశస్" "పల్లవ పకోర్సు" అను రాజుకు పిమ్మట తక్షశిలలో క్రీ॥శ. 78 సం॥రములో రాజ్యముచేసిన రాజని స్పష్ట పడుచున్నది. ఆ సం॥రము(క్రీ॥శ. 78 సం॥) యితని రాజ్యకాలముకు ఆఖరున్నా కానిష్కుని రాజ్యకాల ప్రారంభమున్నా అయియున్నది ఆశకమే కుషానురాజుల శాసనము లో వాడియుండెరి" అని వ్రాసియున్నాడు

(Cambridge his. of India By E. J. Rapson P. 585).

ఇ. జె రాప్సన్ మహాశయుడు తన "కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా" మొదటి వాల్యూం 583వ పుటలో లోగడ పుటలలో విచారణ చేయబడిన హంశములను సమీక్ష చేయుచు సారాంశము నీ విధముగా వ్రాసియున్నాడు

"The chronology of this period has been one of the most perplexing problems in the whole of Indian history; and the problem can scarcely be said to be solved positively even now; that is to say, it has not been placed beyond all possibility of doubt. But the evidence obtained by Sir. John Marshall from his excavations of the ancient sites of Takshacila proves conclusively that the period of Kanishka's reign must have been somewhere about the end of the first century A. D; and a camparison of this evidence with the statements of Chinese historians and with the dates supplied by inscriptions makes it seem almost certain that Kanishka was the founder of the well-Known era which began in 78 A. D."

అని రాప్సను మహాశయు డూహాగానము చేయుచున్నాడు. ఇట్లే చరిత్రకారులందరు చేసియుండిరి. భారతదేశములోని పంచాంగములలో నేటికిని వాడబడుచు ప్రజలందరివలనను భక్తి గౌరవములతో చూడబడు చుండినట్టియు కలి 3179 సం॥ (క్రీ. శ. 78 సం॥) నుండి ప్రారంభింపబడి లెక్కింపబడు చుండినట్టియు, క్రీ. శ. 78 సం॥ మున శక, యవన, కుషానులను వారల మర్దించి యీ దేశము నుండి వెడల నడచిన భారతవర్ష చక్రవర్తియైన "శాలివాహన" చక్రవర్తిచే ప్రారంభింపబడిన "శాలివాహన శకము" యేనాడో పశ్చిమ భారతమున అల్ప రాజ్యమును సంపాదించి రాజ్యము చేసి పోయిన కుషానురాజు "కానిష్కు"నికి కట్టపెట్టబడి శాలివాహన చక్రవర్తి చరిత్రయంతయు మరుగుపరచబడినది. శాలివాహన శకమును కానిష్కుని శకముగా స్థిరపరచుట కింకను యిట్లూహాగానము చేయబడినది.

"భవల్పూరు రాష్ట్రములోని "స్యూ" విహార శాసనములో కానిష్కుని రాజ్యకాలము 11 అని వేయబడినది. (Vide hoernle, Ind. Ant. 1881 P. 326) క్రీ॥ శ. 78 + 11 = 89 సం॥ అగును". ఇంకను యిట్లు వ్రాసియున్నాడు.

"కుషానుల అధికారము నంగీకరించిన శక, పల్లవ, క్షాత్రపుల వలన దిగువ సింధునదీ ప్రాంతములకును, సౌరాష్ట్ర, మాల్వా రాష్ట్రములకును కుషాను అధికారము వ్యాపించినది. ఈ పశ్చిమ క్షాత్రపులు భారతీయ రాజుల శాసనములలో "శకుల"ని వాడబడి యుండిరి. ఈ క్షాత్రపుల రాజ్యము క్రీ॥ శకము రెండవ శతాబ్ద ప్రారంభము లగాయతు నాలుగవ శతాబ్దమువరకు నిలిచియుండి పిమ్మట గుప్తచక్రవర్తులచే జయింపబడినది. నాణెముల మీదను, శాసనముల మీదను వేయబడిన రాజుల పరిపాలనా సంవత్సరములన్నియు కానిష్కుని పట్టాభిషేక కాలమైన క్రీ॥ శ. 78 సం॥ నుండి యేర్పడిన శకము ప్రకారమైయున్నది. ఆ తేదీలు 41 సం॥ రము లగాయతు 310 సం॥ రము వరకు (అనగా క్రీ॥ శ. 119—388 సం॥) గలవు. అవి ప్రాచీన పశ్చిమ భారతమున గల శాసనము లందంతటను వేయబడియున్నవి. పశ్చిమ భారతమున చాలా

కాలము నుండి ఆ శకమే వాడబడుచుండి నందున దానికి "శకకాలము అని వాడుక కలిగినది" అని వ్రాసియున్నాడు. (ఇ. జె. రాప్సను హిస్టరీ ప్రథమ భాగము 585 పుట).

## రాజుల జాబితా

1. క్రీ॥ శ. 45 సం॥ రములో "గాండో ఫరేన్సు" పార్థియను లేక పల్లవరాజు (Gondopharnes)

2. క్రీ॥ శ. 45—78 మధ్య కాలములో "పకోర్సు" (Pacores).

3. "కుజులాకాడ్ పాసిస్" (Kujula kad phasis)

4. "విమకాడ్ పాసిస్" (Vima Kadphasis) చివర సం॥ రము క్రీ॥ శ. 78 సం॥ రం" (ఇ. జె. రాప్సను ఇండియా చరిత్ర 1 వాల్యూం 583 పుట).

కానిష్కుడు రాజ్య ప్రారంభ కాలము క్రీ॥ శ. 78 సం॥ అని యూహించబడి క్రీ॥ శ. 78 సం॥ లోని శాలివాహన శకము కానిష్కుని శకముగా చేయబడినది.

పాశ్చాత్య పండితులచే చేయబడిన విమర్శనలు, నిర్ణయములు జాగ్రత్తగా చదివినవారికి అందలి రహస్యము స్పష్టముగా గోచరించును. అలెగ్జాండరు దండయాత్రా కాలముకు ఇచ్చటనుండిన రాజు ఆంధ్ర వంశములో ఆఖరువాడగు ల్లైనరు "చంద్రశ్రీ" ఆతని గార్డియనులు మంత్రి సేనాపతులుగా నుండిన "చంద్రగుప్త సముద్రగుప్తులు." వారిని గుర్తించుటలో పాశ్చాత్య పండితులు పొరబడి వారలు చంద్రగుప్త మౌర్యాదులుగా గుర్తించబడినందున భారతదేశచరిత్రలో 1207 సంవత్స రములు తరిగిపోయినది. ఈ పొరబాటును "ట్రాయి"యను పండితు డానాడే మాక్సు మూలరు పండితునకుచూపి దానిని సవరించుకొన గోరెను. కాని వారట్లు సవరింపక ఆ పొరబాటు తేదీలనట్లే యుంచి భారతదేశచరిత్రలను లిఖించిరి అటుపిమ్మట "కుప్పయ్య" యను ఆంధ్ర పండితుడా పొరబాటును చూపుచూ వ్రాసియుండెను. కాని ఆ పొర

బాటు సవరింపబడనేలేదు. అందువలన పురాణములలో చెప్పబడిన కాలములకు పాశ్చాత్యులచే వ్రాయబడిన భారతదేశచరిత్రలకు పొందిక కుదురుటలేదు. పాశ్చాత్య పండితులు తమ పొరబాటును సరిచేసుకొనక పోగా పురాణములలోని తేదీలు తప్పులని ప్రచారము చేయుచు తమ చరిత్రలలో వ్రాసియుండిరి. వారి పొరబాటు కాలనిర్ణయమువలన ఆంధ్ర శాతవాహనవంశ మంతరించి గుప్తరాజుల రాజ్యము ప్రారంభ మగు చుండిన కాలముకు మౌర్యవంశరాజుల రాజ్యము ప్రారంభింప బడి నట్లయినది. ఆ పిమ్మట రాబడిన శుంగ, కాణ్వవంశములు వారి లెఖ్ఖ ప్రకారం క్రీ॥పూ. 320 సం॥రము లగాయతు మౌర్యవంశం 137 సం॥ శుంగవంశం 112 సం॥ కాణ్వవంశం 45 సం॥ మొత్తం 294 సం॥రములు క్రీ॥పూ. 320—294 = క్రీ॥పూ. 26 సం॥రమున ఆంధ్ర శాతవాహన వంశము ప్రారంభము కావలసి వచ్చినది. న్యాయముగా భారతయుద్ధము నుండి రాజవంశావళి కాలము వరుసను లెక్కించిన క్రీ॥పూ. 833 సంవత్సరముకు ఆంధ్రశాతవాహన వంశము మగధలో రాజ్యమునకు వచ్చియున్నది. పాశ్చాత్యుల లెఖ్ఖప్రకారం క్రీ॥పూ 240 సం॥రమున వచ్చియుండవలెను. అట్లుగాక ఆంధ్రవంశ ప్రారంభం క్రీ॥ పూ. 26 సం॥రమునకు వచ్చియున్నది. అందుకొరకు శుంగ, కాణ్వవంశములు ఆంధ్ర వంశముకు సమకాలిక వంశములుగా వాదించుచు ఆంధ్రవంశములోని 11,12,13 రాజులలో యెవరోయొకరు కాణ్వరాజును చంపి మగధ నాక్రమించినట్లు కల్పనచేసి వారిచరిత్రలలో వ్రాసుకొనిరి కాని వారి కిందుకు గొప్ప ప్రతిబంధక మొకటి తటస్థించినది అదేదన విక్రమార్క, శాలివాహనుల రాజ్యములు, వారిశకములు – వారికాలములు భవిష్య మహాపురాణములో కలిసంవత్సరములలో అసందిగ్ధముగా స్పష్టమైన వాక్యములతో క్రీ॥పూ. 1వ శతాబ్దము క్రీ॥శ. 1వ శతాబ్దముగా చెప్పబడినది. వారుభయులు సామాన్యరాజులుకారు. భారతవర్షమునంతను జయించి అశ్వమేధ యాగము లొనర్చిన చక్రవర్తులై యుండిరి. అంతేగాక ఆ మహారాజులు నేటికిని ప్రజల నిత్యవ్యాపారములలో కూడను సన్నిహితులై వారిశకములు నిత్యము పంచాంగములలో స్మరింపబడు

చుండుట మూలమునను, వారి సాహసోపేతమైన కథలు పిన్నపెద్దలందర వలనను, చెప్పుకొనబడుచు ఆనందమును పొందుచుండుటవలనను వారి సభలోనుండిన నవరత్నము లనబడు కవులు, వారిరచనలు నేటికిని స్మరింపబడు చుండుటచేతను వారి పేరెత్తిన తమ యసత్య చరిత్రల భండారము బయటపడునని యెంచి వారసలే లేరని యెగరగొట్టుటకంటె గత్యంతరము లేదని తలచి పాశ్చాత్య పండితు లీయద్భుత వాదమును ప్రారంభించిరి.

విక్రమ శాలివాహన శకకర్తలుభయులు అగ్నివంశపురాజులు లేక ఆంధ్రనియోగ బ్రాహ్మణప్రభువులై యున్నారు. వారిచరిత్రలు వారికాలము స్పష్టమైన వాక్యములతో భవిష్య మహాపురాణము చెప్పు చున్నది. ముందు గ్రంథమున మీరు వారిచరిత్రలు చదువగలరు. పాశ్చాత్య పండితుల చరిత్రలకిది ప్రతిబంధకముగా నున్నందున ఈ అగ్ని వంశముల చరిత్ర పాశ్చాత్య పండితు లెత్తుకొనకుండుటకును ఆశకములు రెండును కుషానురాజులు, శకరాజులవని తారుమారు చేయుటకును కారణము. అందుకొరకు వారనేక పాట్లుపడి యుండిరి.

## సైరసు శకము

ఇకను పశ్చిమభారతములోని శాసనములలో వేయబడిన శకము క్రీ॥పూ. 58 సం॥రమున యేర్పడినదిగాని, క్రీ॥ శ. 78 సం॥రముదిగాని కాదు. ఆశకము క్రీ॥ పూ. 550 సం॥రమున యేర్పడిన "సైరసుద్గ్రేటు" అను పారశీకరాజు పేరున యేర్పడిన శకము. విక్రమార్క, శాలివాహన శకములను కుషానుశకముల కంటగట్టుటకుగాను "సైరసు" శకము నొదిలి యేనాడో క్రీ॥ పూర్వము అయిదు, నాలుగు శతాబ్దములలో పశ్చిమభారతమున అల్పరాజ్యముల నేలిన శక, కుషానురాజులను గొప్ప చేయుచు భారతీయ శకములను వారిశకములుగా వాదించియుండిరి.

మొదటిశకరాజైన "మాస్" (Maues) యొక్క శాసనము 78 అని వేయబడియున్నది. సైరసుశకము క్రీ॥పూ. 550 నుండి 78 తీసి

వేయగా (550–78 = ) క్రీ॥పూ. 472 సం॥ ఆశాసనము వేయబడిన కాలమైయున్నది.

సర్. జాన్ – మార్షలుకు దొరకిన "చీర్‌తోపు" శాసనములో 136 సం॥ ఆషాఢ శుద్ధ పంచమి అని వేయబడినది. ఆ కాలమున పశ్చిమోత్తర భారతమున సైరసుశకమును వాడియుండిరి. వరాహమిహిరుడు తన బృహత్సంహితయను జ్యోతిష గ్రంథములోకూడను సైరసుశకమునే వాడియున్నాడు. ఆతడు క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దములోనివాడు. క్రీ॥పూ॥ 550–136 = క్రీ॥ పూ॥ 414 సం॥ర మా శాసనకాలమైయున్నది. ఆ శాసనమును సంపాదించిన సర్. జాన్. మార్షల్ నిర్ణయం ప్రకారం "మొదట ఎజెస్" (Azes I.) అను రాజు రాజ్యమునకు వచ్చినకాలము క్రీ. పూ. 414 సం॥రముగాని మన పాశ్చాత్యపండితుల యూహల ప్రకారం క్రీ॥ పూ॥ 58 కానేరదు ఆనాటికింకను "విక్రమాదిత్యుని" శకము పుట్టియుండలేదు. క్రీ॥ పూ॥ 58 సం॥రమున ప్రారంభింపబడిన విక్రమశక కర్తయైన విక్రమాదిత్యుడను రాజు పాశ్చాత్యపండితులు కలలుగనినట్లు పుట్టియుండనియెడల అది "ప్రథమ ఎజెస్" అను వాదన చెల్లవచ్చునేమోగాని క్రీస్తుకు పూర్వపు శతాబ్దములో విక్రమార్కుడును, క్రీస్తుకు తరువాత శతాబ్దములో శాలివాహనుడును పుట్టి రాజ్యములుచేసి శకాది పరదేశీయులను చావ చిదుగకొట్టి దేశమునుండి వెడల నడచి వారిని సింధునదిని దాటి తూర్పుగాగల ఆర్యదేశములోనికి రాకుండునట్లు కట్టుదిట్టములుచేసి వారివలన కప్పములు పుచ్చుకొనినట్లు పూర్తియైన ఋజువు దొరకియున్నందువలన ఆ కాలములో శకాది పరదేశీయులు దేశములో నిలిచి రాజ్యములు చేసినారని తమ వ్యూహాగానముచే జేయబడిన పాశ్చాత్యపండితుల వాదనలు చెల్లనేరవు. విక్రమార్కుని రాజ్యాంతమునుండి శాలివాహనుని పట్టాభిషేకమువరకుగల వ్యవధి సుమారు యేబది సం॥రములకాలములో యే శకరాజైనను దేశంలోనే యల్పభాగమునైనను స్వాధీనపరచుకొనియుండిన ఆ వెంటనే రాబడిన శాలివాహనుడు వారినందరిని వెడలగొట్టియున్నాడు. ఆ కాలములోగల శకులను దోపిడిదారులుగానే పురాణము వర్ణించినదిగాని

వారిచ్చట నిల్చి రాజ్యములు చేసినట్లు చెప్పియుండలేదు. అందువలన యీ శక, కుషాను రాజులందరు క్రీ॥ పూ॥ 5, 4, 3, 2 శతాబ్దముల లోనివారై యున్నారు. క్రీ॥ పూ॥ 4, 3, 2 శతాబ్దములలో శకరాజులు "ఉజ్జయినీ"మీదకు దండెత్తి అచ్చట రాజ్యస్థాపనచేసియుండిన అగ్ని వంశపు రాజులైన ప్రమరవంశమువారిని వరుసను నలుగురిని సంహరించి శకులుజ్జయినియందు రాజ్యముచేసినటుల పురాణము వర్ణించియున్నది.

అటు పిమ్మట ప్రమర వంశపు రాజులు శ్రీశైలమునకు వచ్చి యిచ్చట రాజ్యము చేసియుండిరి. క్రీ॥ పూ. 377 సం॥ లగాయతు క్రీ॥ పూ. 82 వరకు మధ్య మధ్య శకరాజులు రాజ్యము చేసియుండిరి. అటుపిమ్మట క్రీ॥ పూ. 82 సం॥ మున విక్రమాదిత్యుడు ఉజ్జయినీని తిరిగి జయించి దానిని ప్రమరవంశపు రాజులకు రాజధానిగ నొనర్చి యున్నాడు. క్రీస్తుకు పూర్వము ఐదవ శతాబ్దములో శాతవాహన వంశములోని గౌతమీపుత్ర శాతకర్ణియు, ఆ పిమ్మట మూడవ శతాబ్దములో సముద్ర గుప్తుడును, రెండవ చంద్రగుప్తుడును శకాది పర రాజులను సంహరించి "ఉజ్జయినీ" రాష్ట్రమును (పశ్చిమ మాల్వారాష్ట్రము) తమ సామ్రాజ్యములో కలుపుకొనిరి. ఆ తరువాత రెండవ శతాబ్దములో స్కందగుప్తుని అనంతరము తిరిగి శకులుజ్జయినీని జయించుటయు క్రీ॥ పూ. 82 సం॥ రములో విక్రమాదిత్యుడు వారిని వెడలగొట్టుటయు జరిగియున్నది. క్రీస్తుకు పిమ్మటి శతాబ్దములలో శకాదుల రాజ్యము లేమియు భారతవర్షమున యున్నటుల కనుపించవు. పాశ్చాత్య పండితులు అలెగ్జాండరు దండయాత్రా కాలమున భారతవర్షమున గల రాజు చంద్రగుప్త మౌర్యుడని యెంచిన పొరబాటును కప్పిపుచ్చుకొనుటకుగాను క్రీస్తుకు పూర్వపు శతాబ్దములలోని శక, కుషాను రాజులను, ఆంధ్ర శాతవాహనులను, గుప్తరాజులను క్రీస్తు శకమున కిటీవలికి దెచ్చి చరిత్రల నల్లియుండిరి. అట్టి అల్లికకు అడ్డము వచ్చిన అగ్నివంశముల చరిత్రయు, అందలి ప్రమర వంశమున జనించిన విక్రమాదిత్య, శాలివాహనుల చరిత్రలు బైటికి రాకుండ అణచివేయబడుటయే గాక విక్ర

మాదిత్య, శాలివాహను లసలే లేరని వ్యతిరేకప్రచారము చేయబడినది. విక్రమాదిత్య, శాలివాహనుల చరిత్ర అల్పమైనది కాదు.

భవిష్య మహాపురాణములో ప్రతిసర్గ పర్వములోగల నాలుగు ఖండములలోను యీ వుభయుల చరిత్ర దిగువ విధమున విస్తారముగా వర్ణితమైనది.

| | | | | అధ్యా. | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1 | ఖండములోగల | 7 | అధ్యాయములలో | 7 అధ్యాయం | 1 |
| 2 | ,, | 35 | ,, | 35 పూర్తి | 35 |
| 3 | ,, | 32 | ,, మొదటి | 4 ,, | 4 |
| 4 | ,, | 26 | ,, | 4 ,, | 4 |
| | మొత్తం | 100 | అధ్యాయములలో | | 44 |

అధ్యాయముల లీయుభయచక్రవర్తుల చరిత్రలోను అగ్నివంశము లన్నిటియొక్క చరిత్ర . మొత్తం 72 అధ్యాయములలోను వర్ణితమై యుండగా భారతదేశచరిత్రకారులకెందు కుకనబడకుండినదో యోజింపుడు.

పురాణములన్నిటికి భవిష్యపురాణములోగల కలిరాజ వంశములే మూలములనియు, దానినుండియే రాజవంశావళులు మిగతా పురాణములలో కెక్కించిరనియు వ్రాసిన పండితులీ అగ్నివంశపు రాజుల నెందుకు వదలివేసియుండిరో ఆలోచించుడు - విక్రమాదిత్య, శాలివాహనుల చరిత్రల నెత్తినచో తమచే కట్టబడిన చారిత్రక కట్టడమంతయు పేకముక్కల మేడవలె గుప్పునకూలిపోవునని వారికి బాగుగా తెలియును. భారతీయచరిత్రకారు లిప్పటికైనను మేలుకొని తమపురాణ వాఙ్మయమును పరిశోధించి సత్యచరిత్రలు వ్రాసుకొనుటవసరమని మనవి.

## పల్లవ, శక, కుషాను రాజుల సరియైన కాలము

1. పశ్చిమోత్తర భారతమున రాజ్యము
చేసిన పల్లవరాజు "గాండోఫరెస్సు" క్రీ॥ పూ. 389—463.
(Gondopharnes)

| | |
|---|---|
| 2. శకరాజు "పకోర్సు" (Pacores) | 463_430 మధ్యకాలము |
| 3. కుషాను రాజులు (1) కుజూలాకాడ్ పాసిస్, (2) విమకాడ్ పాసిస్. యీ ముగ్గురు రాజులు | |

4. కానిష్కుడు – రాజ్యపట్టాభిషేకము క్రీ॥ పూ. 430.

అతని రాజ్యకాలము అరువది సంవత్సరములు క్రీ. పూ. 430–క్రీ 370 వరకు. నాసికయందు గల శకాదులను క్రీ॥ పూ. 414 సం॥ రములో "గౌతమీపుత్ర శాతకర్ణి" నాశనముచేసి ఆ రాష్ట్రమును తన రాజ్యములో చేర్చుకొనియున్నాడు. అటు పిమ్మట రెండవ చంద్రగుప్తుని "మధుర" రాతి శాసనములో "కుషాను రాజుల" క్రింద నుండిన రాజ్యమును తాము జయించినట్లును, గుప్తరాజ్య మంతవరకు వ్యాపించి యుండినట్లును గలదు. రెండవ చంద్రగుప్తుని రాజ్యకాలము క్రీ॥ పూ. 269_233 సం॥ రం (గుప్తశకం 58_94 సం॥ అగును). రెండవ చంద్రగుప్తుని కాలమున పశ్చిమోత్తర రాష్ట్రములు, మాల్వా, మధ్యప్రదేశములు జయింపబడి గుప్తరాజ్యములో చేర్చుకొనబడినవి. ఉజ్జయినీ మహాక్షాత్రవులకాలమున ఆఖరు తేదీ శక సం॥ 310 ఇది శాలివాహన శకము గాని లేక దాని నాచ్ఛాదించిన కానిష్కుని కల్పిత శకముగాని కాదు. అది "సైరసు" శకమై యున్నది. సైరసు శక ప్రారంభం క్రీ॥ పూ. 550 సం॥ రం. అందుచే 550 – 310 = క్రీ। పూ. 240 సం॥ అగును. ఆ కాలమున రెండవ చంద్రగుప్తుడు మహాక్షాత్రవులను నాశనముచేసి ఉజ్జయినీని తన రాజ్యములో చేర్చుకొని యుండెను అని రెండవ చంద్రగుప్తుని మధురలోని శాసనము చెప్పుచున్నది. అటు పిమ్మట క్రీ॥ పూ. రెండవ శతాబ్దము ఆఖరుకానున్న కాలములో "ఉజ్జయినీ" శకుల వలన తిరిగి ఆక్రమింపబడగా క్రీ॥ శ. 82 సం॥ రములో "విక్రమాదిత్యుడు" వారిని జయించి దేశమునుండి తరిమివేసెను.

"స్యూ" విహార శాసనములో (భవల్పూరురాష్ట్రములోనిది). కానిష్కుని రాజ్యకాలము 11 అని వేయబడినది. కానిష్కుని రాజ్యకాల

ప్రారంభం క్రీ॥ పూ॥ 430 నుండి 11 తీసివేయగా క్రీ॥ పూ॥ 419 సం॥ అగును. పశ్చిమభారతమునందా కాలమున నాణెములమీదను, శాసనములలోను 41 నుండి 310 వరకు సం॥రములు వేయబడియున్నవి. అవన్నియు "సైరసు" శక సంవత్సరములు. శాలివాహనశకముగాని, కానిష్కుని శకముగాని (కానిష్కుని శకమనునది పాశ్చాత్య పండితుల కల్పన) కాదు.

ఈ ప్రకారము పాశ్చాత్యపండితులు భారతదేశ చరిత్రలో కాలమును తగ్గించి భారతయుద్ధము లగాయతుగల 5086 సం॥రముల కాలమును సుమారు మూడువేల సం॥రములకు దెచ్చి ఆ కాలములోనె 28వ మహాయుగ ప్రారంభంనుండి నేటివరకుగల సుమారు నలుబది లక్షల కాలములోజరిగిన చరిత్ర నంతను యిముడ్చుటకు ప్రయత్నించి విఫలులైరి.

## అగ్నివంశములు

ఋషయ ఊచుః :—

శ్లో॥ చతుర్ణాం వహ్ని జాతానాం పరంకౌతూహలం హినః
సహరి స్త్రియుగీ ప్రోక్తః కథంజాతః కలౌయుగే ॥
(భవిష్య, 3-౪-౧-౧-౨.)

సూత ఉవాచ :—

శ్లో॥ కథయామి మునిశ్రేష్ఠా యుష్మాకం ప్రశ్నముత్తమం ।
అగ్నివంశ నృపాణాంచ చరిత్రం శృణువిస్తరాత్ ॥ (౧౩)

శ్లో॥ ప్రమరశ్చ మహీపాలో దక్షిణాం దిశ మాస్థితః ।
అంబయా రచితాం దివ్యాం ప్రమరాయ పురీం శుభాం॥ (౧౪)

శ్లో॥ నివాసం కృతవా న్రాజా సామవేద పరో బలీ।
షడ్వర్షాణి కృతం రాజ్యం తస్మా జ్జాతో మహామరః॥ (౧౫)

తా॥ శౌనకాదిఋషులిట్లు అడిగియుండిరి. అగ్నిజాతులయిన నాలుగు వంశములువారియొక్క చరిత్రను వినకౌతూహలము గలిగి యుంటిమి. కృత, త్రేత, ద్వాపరములయందు హరియొక్క అవతార

లీలలు చెప్పబడినవి. ఇకను కలియుగమందు ధర్మసంరక్షణమునకెట్లు పుట్టి వ్యవహారించునో దానిని మాకు చెప్పుమని అడుగగా సూతుడిట్లు చెప్పుచున్నాడు.

ఓ మునిశ్రేష్ఠులారా! మీ ప్రశ్న ఉత్తమమైనది. అగ్నివంశములవారియొక్క చరితమును సవిస్తరముగా చెప్పుచుంటిని వినుడు.

ప్రమరుడనెడి రాజు దక్షిణదిశను పాలించెను, ప్రమరునికొరకు "అంబ" యనెడి దేవతచే నిర్మింపబడిన "అంబావతి పురి" యనెడి శుభకరమైన పట్టణమందాతడు నివసించెను. ఆతడు సామవేదమును సాంగోపాంగముగా నధ్యయన మొనర్చినవాడు. బలవంతుడైనరాజు. ఆతడారు సంవత్సరములు రాజ్యము చేసెను. ఆతని కుమారుడు మహామరుడు. ఆతనికి దేవాపి, ఆతనికి దేవదూతలను వారలు కుమారులుదయించి మూడేసి సంవత్సరములు రాజ్యము చేయుచు శకాదులచే యుద్ధములందు చంపబడుచుండిరి.

## అగ్ని వంశములు నాలుగు

అగ్నివంశ లేక బ్రహ్మక్షత్రయనబడు వంశములు నాలుగు. వీరిని బ్రహ్మక్షత్రులని నేటికిని ఉత్తరభారతమున పిలుచుచుండిరి. అగ్నికులుల మూలపురుషులు నలుగురు. 1. ప్రమర 2. చయహాని లేక చపహాని లేక వయహాని 3. శుక్ల లేక చాళుక్య 4. పరిహార. అనువారలు. కన్యాకుబ్జమందుగల యొక బ్రాహ్మణుడు దేశము మ్లేచ్ఛులచే దైన్యము నొందుట జూచి రాజపుటానాలోని అర్బుదపర్వతము (ఆబూపర్వతము) మీదకుబోయి పై నలుగురచేతను క్షాత్రతేజస్సు తమ యందు నిలుచునట్లుగ (దేశక్షేమము నిమిత్తము) వేదమంత్రములచే హోమాదులను చేయుచు అగ్ని నుపాసింపజేయుగా వారు క్షాత్రమును పొందినట్లు పురాణము చెప్పుచున్నది

శ్లో॥ "ప్రమర స్సామవేదీచ చపహాని ర్యజుర్విదః।
త్రివేదీచ తథాశుక్లో ఽథర్వాచ స పరిహారకః।
ఐరావతకులే జాతా స్తగజా నాయహ్యాతే పృథక్"॥

(భవిష్య 1_6_47)

తా॥ ప్రమరుడు సామవేదీయశాఖకు చెందినవాడు. చపహాని యజుశ్శాఖకు చెందినవాడు, శుక్లుడు ఋగ్వేది. పరిహారకుడు అధర్వ వేదశాఖీయుడు. ఐరావత కులమందు పుట్టిన ఏనుగులనెక్కి-డి రాజులై వేరువేరుగా నాలుగురాజ్యముల స్థాపించిరి.

శ్లో॥ అవంతే ప్రమరో భూప శ్చతుర్యోజన విస్తృతామ్।
అంబావతీంనామ పురీ మధ్యాస్య సుఖితో ఽభవత్॥ (౩-1-6-49)

తా॥ ప్రమరమహారాజు నాలుగుయోజనములు విస్తీర్ణముగల అవంతి రాష్ట్రములోని "అంబావతీ" అనెడి పేరుగల పట్టణమున నివ సించెను. (ఈ అంబావతి" పట్టణము "శ్రీశైలమ"ని కొందరు పండి తుల అభిప్రాయము. "ఉజ్జయిని" అని బహుమంది అభిప్రాయము)

శ్లో॥ "చిత్రకూట గిరో ర్దేశే పరిహారో మహీపతిః॥
కలింజరపురం రమ్య మక్రోశాయతనం స్మృతం॥ (భవిష్య3-1-7-1)

తా॥ చిత్రకూటగిరి దేశమందు కలింజరపురమున (బంగాళా దేశములో చేరిన యొకప్రదేశము) పరిహార మహారాజు నివసించెను.

శ్లో॥ "రాజపుత్రాఖ్య దేశేచ, చపహాని ర్మహీపతిః।
అజమేర పురంరమ్యం విధి శోభా సమన్వితం।
చాతుర్వర్ణ్య యుతం దివ్యమధ్యాస్య సుఖితో౽భవత్॥(3-1-7-2,3)

తా॥ రాజపుత్రస్థానములోని అజ్మీరు పురమున చపహాని మహా రాజు చాతుర్వర్ణ్యములతోగూడి పరిపాలించుచుండెను.

శ్లో॥ "శుక్లోనామ మహీ పాలో గత ఆనర్తమండలే।
ద్వారకానామనగరీ మధ్యాస్య సుఖితో ఽభవత్॥"
(భవిష్య 3-1-7-4)

తా॥ శుక్లమహారాజు ఆనర్తమండలమున (గుజరాతుదేశము) ద్వారకానగరమును (తిరిగి నిర్మించి) సుఖముగా రాజ్యముచేయు చుండెను.

ఈ శుక్లమహారాజు కాశ్యపుడను బ్రాహ్మణుని కుమారుడనియు, అర్బుద పర్వతముమీద అగ్నిను పాసించుచు తపస్సు చేయుచుండెననియు

ఆ విప్రునికి శ్రీకృష్ణ భగవానులు ప్రత్యక్షమై నాతనిచేతిని పట్టుకొని అచ్చట సముద్రతీరమునకు తీసుకొనిపోయి పూర్వపు ద్వారకానగరము మునిగిపోయిన ప్రదేశమునుజూపి ఆ తీరమున ద్వారకానగరమును నిర్మింప నాజ్ఞాపించెననియు, నాతడట్లుచేసి తనతోగల ముగ్గురు బాంధవులు (అనగా ప్రమర, చపహాని, పరిహార)తో కలిసి అందు ప్రవేశించె ననియు చెప్పబడినది. ఆ నలుగురు బంధువులు నాలుగురాజ్యములను స్థాపించి మ్లేచ్ఛులతో యుద్ధమొనర్చి తిరిగి ధర్మమును ప్రతిష్ఠించిరని పురాణము చెప్పుచున్నది. అటుపిమ్మటగల వాక్యమున పురాణమందిట్లు చెప్పబడినది.

శ్లో॥ "తేషా మగ్న్యుద్భ వానాంచ యే భూపారాజ్య సత్కృతాః
తాన్మేబ్రూహి మహాభాగ సూతో వాక్య మథాబ్రవీత్ ॥
(భవిష్య 3_1_7_5)

తా॥ పైన చెప్పబడినట్టు అగ్నియందుద్భవించి రాజ్యములు చేసిన యే రాజులైతే గలరో వారిని గురించి (వివరముగా) చెప్పుమని శౌనకాదిమును లడుగగా సూతుడు చెప్పుచున్నాడు.

## ప్రమర వంశం

శ్లో॥ సప్తవింశతి శతేవర్షే దశాబ్దే చా ధికే కలౌ
ప్రమరోనామ భూపాలః కృతంరాజ్యం చ షట్సమాః॥
(భవి. 3_1_7_7,8)

తా॥ కలిలో 2710 సం॥ రములు గతించిన పిమ్మట (క్రీ॥ పూ. 392) ప్రమర మహారాజు ఆరు సం॥ రములు రాజ్యముచేసి గతించెను.

అతని కుమారుడు "మహామరుడు" మూడు సంవత్సరములు రాజ్యము చేసి చనిపోయెను. ఆతని కుమారుడు దేవాపి మూడు సంవత్సరములు రాజ్యము చేసియుండెను. ఆతని కుమారుడు "దేవదూత" మూడు సం॥ రములు రాజ్యము చేసెను. వీరందరు శకుల యుద్ధమందు చంపబడిరి. ఆతని కుమారుడు "గంధర్వ సేనుడు". ఈతడు శకులను

సంహారించి యేబది సంవత్సరములు రాజ్యము చేసి యుండెను. ఆతడు తన కుమారుడగు "శంఖుని"కి పట్టాభిషేక మొనర్చి వనమునకు తపస్సు చేయ బోయియుండెను. ఆ "శంఖ" మహారాజు ముప్పది సంవత్సరములు రాజ్యముచేసి గతించెను. (3–1–7–9,11). తపస్సు నుండి తిరిగి వచ్చిన ఆ గంధర్వ సేనునికి తిరిగి కుమారుడు కలిగెను. ఆ విషయ మిట్లు పురాణమున చెప్పబడినది.

## విక్రమాదిత్యుడు

శ్లో॥ " పూర్ణే త్రింశచ్ఛతే వర్షే కలౌ ప్రాప్తే భయంకరే " ॥
(3–1–7–14)

,, శకానాంచ వినాశార్థ మార్య ధర్మ వివృద్ధయే ।
జాత శ్శివాజ్ఞయా సో ఽపి కైలాసా ద్గుహ్య కాలయాత్ ॥
(భవిష్య, 3–1–7–15)

,, విక్రమాదిత్యనామానం పితా కృత్వా ముమోదహ ।
సబాలో ఽపి మహాప్రాజ్ఞః పితృ మాతృ ప్రియంకరః॥"(3–1–7–16)

,, పంచవర్షే వయః ప్రాప్తే తపసో ఽర్థేవనం గతః ।
ద్వాదశాబ్దం ప్రయత్నేన విక్రమేణ కృతం తపః॥" (3–1–7–17)

,, పశ్చా దంబావతీం దివ్యాం పురీం యాతః శ్రియాన్వితః ।
,, దివ్యం సింహాసనం రమ్యం ద్వాత్రింశ న్మూర్తి సంయుతం।"
(3–1–7–18)

తా॥ భయంకరమైన కలియుగము ప్రాప్తించి మూడువేల సంవత్సరములు నిండినదగుచుండగా (క్రీ॥ పూ॥ 101 సం॥) శకులను నాశనం చేసి ఆర్యధర్మమును ద్ధరించుటకుగాను, శివుని ఆజ్ఞ వలన కైలాసమునందలి గుహ్యాకాలయమునుండి యొక పురుషుడు గంధర్వసేన మహారాజున కుదయించెను. ఆ పిల్లవానికి "విక్రమాదిత్య"యని పేరిడి తండ్రి సంతోషించినవాడాయెను. ఆతడు పసివాడైనను మహాప్రాజ్ఞుడు. తల్లిదండ్రులకు ప్రియంకరుడునై యుండెను. ఐయిదు సంవత్సరములు వయస్సు వచ్చిన

దగుచుండగా తపస్సు నిమిత్తం వనమునకు వెళ్ళి పండ్రెండు సంవత్సరములు విక్రమాదిత్యుడు తపంబొనర్చెను.

అటు పిమ్మట తపోమహిమతో గూడినవాడై "అంబావతి" పట్టణము (ఉజ్జయినీనగరం)కు వచ్చి ముప్పదిరెండు ప్రతిమలతో అలంకరింపబడిన సువర్ణ సింహాసనమున పట్టాభిషేక మొనర్చుకొన ప్రయత్నింపగా. పార్వతీ దేవతచే పంపబడిన "బేతాళుడ"నెడి యొక దేవత బ్రాహ్మణ రూపమున వచ్చి విక్రమాదిత్యునాశీర్వదించి యిట్లు చెప్పెను. ఓరాజా! నీవీ సింహాసనమున కూర్చుండుటకు నిశ్చయించిన యెడల నాచే చెప్పబడు యితిహాసపరంపరగల యొక గొప్ప కథను చెప్పుచున్నాను వినుమని యిట్లు చెప్ప దొడంగెను. (భవిష్య, 3-1-7-19-26 వరకు) అటు పిమ్మట ముప్పదిరెండు అధ్యాయములలో ముప్పదిరెండు కథలు చెప్పబడినవి. అటుపిమ్మట విక్రమాదిత్యునికి పట్టాభిషేక మొనర్పబడెను (భవిష్య, 2వ, ఖండమున గల 35 అధ్యాయములలో 32 కథలు కలిగియున్నవి.)

ప్రమరవంశపురాజులు మొదట అవంతిరాష్ట్రమునకు ముఖ్య పట్టణమైన ఉజ్జయినీయందు రాజ్యమును స్థాపించి మాల్వారాష్ట్రమునున్నూ. అందుకు దక్షిణముగా ఆంధ్రదేశమువరకు కలుపుకొని పరిపాలించిరి. కాని శకులు వీరిని జయించి అవంతిరాష్ట్రము నాక్రమించుకొనిరి. అంతట ప్రమరవంశపురాజులు తమ రాజ్యములో చేరిన శ్రీశైలమునకువచ్చి అచ్చట తమ రాజధానినేర్పరచుకొని వింధ్య దక్షిణ భారతమును పరిపాలించుచుండిరి. క్రీ॥ శ. 3020 సం॥రమున (క్రీ॥ పూ॥ 82 సం॥) విక్రమార్కమహారాజు ఉజ్జయినిమీదకు దండెత్తి శకుల నోడించి వానిని తరిమివేసి మరల తమ పైతృకమైన ఉజ్జయినీపట్టణమున పట్టాభిషిక్తుడయ్యెను. కలి 3044 సం॥రమున విక్రమశక స్థాపన చేసియుండెను. విక్రమార్కుని రాజ్యపాలనమున ద్వాపరయుగ ధర్మములను గలిగి ప్రజలు ధర్మమార్గమున ప్రవర్తించుచు హాయిగా సుఖించిరి.

శ్లో॥ "శివాజ్ఞయాచ నృపతి ర్విక్రమ స్తనయ స్తతః।
శతవర్షం కృతంరాజ్యం దేవభక్త స్తతో ఽభవత్।
దశవర్షం కృతంరాజ్యం శకై ర్దుష్టై ర్లయంగతః॥" (భవిష్య 3-4-1-22)

తా॥ శివాజ్ఞవలన ఆ గంధర్వసేనుని కుమారుడైన విక్రమాదిత్య చక్రవర్తి నూరుసంవత్సరములు రాజ్యముచేసెను. అతనికుమారుడు "దేవభక్త" యనెడివాడు పదిసంవత్సరములు రాజ్యముచేసిన పిమ్మట దుష్టులైన శకులతో జగిగిన యుద్ధమున శకులచే చంపబడెను. ప్రమర మహారాజువలన "ఉజ్జయినీ"యందు రాజ్యస్థాపనము చేయబడిన కాలము కలి 2710 వ సం॥రం (క్రీ॥పూ. 392 సం॥)

| | | | |
|---|---|---|---|
| 1. ప్రమరుని రాజ్యకాలము | 6 | సం॥రములు. | అతనికుమారుడు |
| 2. మహామరుని రాజ్యకాలము | 3 | ,, | ,, |
| 3. దేవాపి ,, | 3 | ,, | ,, |
| 4. దేవదూత ,, | 3 | ,, | |
| మొత్తం | 15 | సం॥రములు | |

అటుపిమ్మట అసమర్థులు, అనామకులైన రాజులను పురాణము చేర్కొని యుండలేదు. అవంతిరాజ్యమును శకులాక్రమించినందున యీ ప్రమరవంశపు రాజులు శ్రీశైలమునకుచేరి అచ్చటనుండి దక్షిణ దేశమును పరిపాలించి యుండిరి. అట్టికాలము 195 సం॥రములు జరిగి పోయినపిమ్మట "ప్రమర" వంశమున "గంధర్వసేన" మహారాజువచ్చి యుండెను. ఆతడు ప్రజ్ఞాశాలి. ఆతనినుండి తిరిగి వంశక్రమము సాగించి పురాణమందు చెప్పబడినటుల కనుపించుచున్నది.

| | కలి | క్రీ॥ పూ॥ |
|---|---|---|
| ప్రమరవంశస్థాపనము | 2710 | 392 |
| ప్రమరుని లగాయతు దేవదూతవరకు అల్పజీవులైన రాజులు నలుగురు | 15 | 15 |
| | 2725 | 377 |
| 5. ప్రమరవంశము వారలు ఉజ్జయినీని ఏడి శ్రీశైలమున రాజ్యముచేసిన రాజుల (పేర్లు చెప్పబడలేదు) కాలము | 195 | 195 |
| | 2920 | 182 |

| | | |
|---|---|---|
| 6. గంధర్వసేనుడు | 50 | |
| 7. శంఖమహారాజు | 30 | 80 |
| | 3000 | 102 |

8. గంధర్వసేనుని రెండవ కుమారుడు "విక్రమాదిత్య" మహారాజు కలి 3001 సం॥ రమున జన్మించియుండెను. కలి 3020 సం॥ ఆతని పట్టాభిషేకము. ఆత డుజ్జయినీమీదకు దండెత్తి శకులను సంహారించి తిరిగి "ఉజ్జయినీ" యందు పట్టాభిషిక్తుడై నూరేండ్లు పరిపాలించెను ఆతని కుమార్డు 9. "దేవభక్త" అనువాడు పది సం॥ రములు రాజ్యమేలెను. ఈ తండ్రి కుమాళ్ళిద్దరు కలిసి నూటపది సం॥రములు అనగా 3020 + 110 = కలి 3130 సం॥ వరకు రాజ్యము చేసియుండిరి (క్రీ॥ శ. 29 సం॥). అటు పిమ్మట సింహాసనమునకు రాబడిన ప్రముఖ రాజు శాలివాహనుడు. ఈతడు విక్రమార్కునికి పౌత్రుడు. అనగా కుమారుని కుమారుడు లేక ప్రపౌత్రుడు కావచ్చును. శాలివాహనుడు క్రీ॥ శ 78 సం॥ రమున శకుల నోడించుటయేగాక హిమాలయముల కావలనుండిన బాహ్లికాది రాజులనందరిని గెలిచి వారు భారత దేశము నుండి దోచుకొనిపోయిన ధనరాసులనన్నిటిని తిరిగి వారినుండి గుంజుకొని వచ్చియున్నాడు. క్రీ॥ శ. 78 సం॥ రమున "శాలివాహన శకము"ను స్థాపించియున్నాడు. క్రీ॥ శ. 29 సం॥నుండి క్రీ॥ శ. 78 సం॥ వరకు మధ్యగల కాలము 49 సం॥రములలో గల రాజులు చెప్పబడలేదు. శాలివాహనుడు క్రీ॥ శ 78 సం॥లో పట్టాభిషిక్తుడై శకాదులను జయించి వారిని దండించెను.

## విక్రముని ఆస్థానములోని నవరత్నములు

జ్యోతిర్విదాభరణమును రచించిన కాళిదాసు తానదివరలో రఘువంశాది కావ్యత్రయమును రచించియుండినట్లును, శకేశ్వరుడగు రూమకేశాధిపతిని మహాసంగ్రామమున జయించి ఉజ్జయినీ నగరమును గ్రహించినవాడును, శంకు మొదలుగాగల పండితులను, అనేకులగు మహాకవులను, వరాహమిహిరాది జ్యోతిర్విదులను బోషించువాడును,

ఉజ్జయినీ చక్రవర్తియునైన విక్రమార్కునకు తాను మిత్రుడైనట్లును, విక్రమార్కు నాస్థానమందుండెడి నవరత్నములలో దానొకడైనట్లును యీ క్రింది శ్లోకములలో చెప్పుకొని యున్నాడు.

శ్లో॥ "యో రూమకేశాధిపతిం శకేశ్వరం।
జిత్వాగ్రహీ తోజ్జయినీం మహాహవే।
ఆనీయ సంభ్రామ్యముమోచతం త్వహో।
శ్రీవిక్రమార్క స్సమసహ్యా విక్రమః" ॥

శ్లో॥ "శంక్వాది పండితవరాః కవయ స్త్వనేకే।
జ్యోతిర్విదస్య మభవంశ్చ వరాహపూర్వాః।
శ్రీవిక్రమార్క నృపసంసదిమాన్య బుద్ధి।
స్తైరప్యహం నృపసఖాకిల కాళిదాసః" ॥

"కావ్యత్రయం సుమతికృద్రఘువంశపూర్వం।
పూర్వం తతస్మృతి హితం శ్రుతికర్మవాదం।
జ్యోతిర్విదాభరణ కాలవిధాన శాస్త్రం।
శ్రీ కాళిదాస కవితో హితంతో బభూవః ॥"

శ్రీ విక్రమార్క మహారాజుయొక్క నాస్థానమందుండిన నవరత్నములను గురించి జ్యోతిర్విదాభరణమున యిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ "ధన్వంతరిక్షపణ కామరసింహ శంకు
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః।
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నాని వై వరరుచిర్నవ విక్రమస్య."॥

"జోతిర్విదా భరణ" మనెడి గ్రంధ రచనా కాలమును గురించి కాళిదా సీవిధముగా చెప్పియున్నాడు (జ్యో. భ. 22 ఆశ్వాసం చూడుడు.)

శ్లో॥ "వర్షే సింధురదర్శనాంబరగుణై ర్యాతే కలే స్సమ్మితే
మాసే మాధవ సంజ్ఞికేచ విహితో గ్రంథక్రియోపక్రమః"॥

తా॥ కలియుగము 3068 సం॥ రములు గడచుచుండగా (క్రీ॥ పూ. 33 సం॥) వైశాఖమాసమందీ గ్రంథరచన ప్రారంభించినట్లుల

చెప్పుకొనియున్నాడు. విక్రమశక ప్రారంభము కలి 3044 సం॥ (క్రీ॥ పూ. 57 సం॥ రం) కలి 3068–3044 = 24. విక్రమశకం 24 సం॥ రములో (అనగా క్రీ॥ శ. 33 సం॥) కాళిదాసు "జ్యోతిర్విదాభరణ" మనెడి గ్రంథ రచన ప్రారంభించి యున్నాడు. కాళిదాసుతో సమకాలికులుగా వరాహ మిహిరాది నవరత్నములు విక్రమార్కుని ఆస్థానమందున్నటుల స్పష్ట పడుచున్నది. విక్రమార్కుని కంటె కాళిదాసు వయసులో చిన్నవాడు. ఈ విధముగా భవిష్య మహా పురాణములో చెప్పబడిన విక్రముని కాల మును, ఆతని యాస్థానములో ఆ విక్రమునికి సమకాలికులుగా నున్నట్లు చెప్పబడిన నవరత్నములనెడు కవులలో నొకడగు కాళిదాసు "జ్యోతి ర్విదాభరణ" మనెడి తన గ్రంథములో కలి శకాబ్దములలో చెప్పబడిన విక్రమార్కుని కాలమును క్రీ॥ పూ॥ మొదటి శతాబ్దమని ఋజువగు చుండగా నా కాలమున విక్రముడనెడి వ్యక్తియే లేనటుల వాదించుచు లోకవంచన చేయుటకు పూనుకొనుట యీ పండితులకు నీతికాదని మనవి చేయుచుంటిమి.

## విక్రమాదిత్యునికి పిమ్మట దేశస్థితి

శ్లో॥ "స్వర్గతే విక్రమాదిత్యే రాజానో బహుధా ఽభవత్।
తథాష్టాదశ రాజ్యాని తేషాం నామానిమే శృణు॥
(భవిష్య3–3–౨–౯)

,, పశ్చిమే సింధునద్యంతే సేతుబంధేహి దక్షిణే।
ఉత్తరే బదరీస్థానే పూర్వేచ కపిలాంతికే॥ (డిటో ౧౦)

,, అష్టాదశైవ రాష్ట్రాణి తేషాం మధ్యే బభూవిరే।
ఇంద్రప్రస్థంచ, పాంచాలం, కురుక్షేత్రంచ, కాపిలం॥ (డిటో ౧౧)

,, అంతర్వేదీ వ్రజశ్చైవ హ్యజమేరం, మరుధన్వచ।
గార్జరంచ, మహారాష్ట్రం, ద్రావిడంచ కళింగకం॥ (౧౨)

,, ఆవంత్యం, చోడుపం, వంగం, గౌడం, మాగధ మేవచ।
కౌశల్యంచ తథాజ్ఞేయుం తేషాం రాజాపృథక్ పృథక్॥ (౧౩)

శ్లో॥ నానాభాషాః స్థితా స్తత్ర బహుధర్మ ప్రవర్తకాః।
ఏవమబ్దశతం జాతం తతస్త్వై శకాదయః॥ (౧౪)

,, "శృత్వా ధర్మ వినాశంచ బహుబృందైః సమన్వితాః।
కేచి త్తీర్త్వా సింధునదీ మార్యదేశం సమాగతాః॥ (౧౫)

,, హిమపర్వత మార్గేణ సింధు మార్గేణ చా గమన్।
జిత్వార్యా న్లూఠయిత్వా తా న్స్వదేశం పునరా యయుః॥ (౧౬)

,, గృహీత్వా యోషిత స్తేషాం పరం హర్ష ముపాయయుః॥"

తా॥ **విక్రమార్కుడు** స్వర్గమును చేరిన పిమ్మట అనేకమంది **రాజులు** (**అసమర్థులు, అనామకులు**) పరిపాలించిరి. (ఆ రాజుల పేర్లు **చెప్పబడలేదు.** వారి కాలము క్రీ॥ శ. 29—78 వరకునై యున్నది.) **అట్టి** కాలమున దేశము పదునెనిమిది రాజ్యములుగా విడిపోయినది. (అనగా వివిధ రాజ్యముల నడపులోనికి తెచ్చి ఏకదారిని నడిపించగల చక్రవర్తిత్వ మంతరించినదని తాత్పర్యము). ఆ రాజ్యముల నామము లను చెప్పుచుంటిమి వినుము. ఆ కాలమున విక్రమాదిత్యుని సామ్రా జ్యములో నున్న భారతదేశ హద్దులు చెప్పబడుచున్నవి. పశ్చిమమున సింధునది ఆవలవరకు, సేతువు దక్షిణము. ఉత్తరమున బదరీనారాయణ క్షేత్రము (ఇది హిమాలయములలో గలదు). తూర్పున కపిల రాష్ట్రము చివరవఱకు అనగా అస్సాము పడమరవరకు హద్దులు గల దేశము. అట్టి హద్దుల మధ్య పదునెనిమిది ఆర్య రాష్ట్రములు గలవు. (1) ఇంద్ర ప్రస్థము (2) పాంచాలము, (3) కురుక్షేత్రము, (4) కాపిలరాష్ట్రము, (5) అంతర్వేదీ, (6) వ్రజరాష్ట్రము, (7) అజమేరు, (8) మరు (రాజ పుటానా) దేశము, (9) ఘూర్జరము, (10) మహారాష్ట్రము, (11) ద్రావి డం, (12) కళింగము (ఆంధ్రదేశమిందుగలదు), (13) అవంతి, (మాల్వా రాష్ట్రము ఉజ్జయినీ రాజధాని) (14) ఉడుపం, (15) వంగదేశము, (16) గౌడదేశము, (17) మాగధము, (18) కోసలదేశము. ఈ రాజ్య ములకు ప్రత్యేకముగా రాజులు గలరు. అందనేక భాషలు గలవు.

ప్రజలు వివిధ ధర్మావలంబులుగా నుండిరి. ఈ ప్రకారం నూరు సంవత్సరములు గడువగా (ఈ కాలము నూరు సం॥ రములుగా లెక్కకు వచ్చుట లేదు. యేబది సం॥లు మాత్రమే వచ్చుచున్నది. విక్రమార్కుని పట్టాభిషేకము లగాయతు శాలివాహనునివరకు 160 సం॥ ర ములు) శకాదులైన మ్లేచ్ఛ జాతులు ఆర్య ధర్మము నశించుచున్నదని విని అనేక గుంపు లేకగుంపుగా గూడి సింధునదిని దాటి ఆర్య దేశముపైకి దండెత్తి వచ్చిరి. హిమాలయములోని మార్గముల ద్వారాను, సింధు మార్గముల ద్వారాను వచ్చి ఆర్యులను జయించి, దేశములను కొల్లగొట్టి దోచుకొనియు, స్త్రీలను చెఱగొనియు, యెత్తుకొనిపోవు చుండిరి.

## శాలివాహనుడు

శ్లో॥ "ఏతస్మి న్నంతరే తత్ర శాలివాహన భూపతిః।

(భవిష్య ౩-౩-౨-౧౭)

,, విక్రమాదిత్య పౌత్రశ్చ పితృరాజ్యం గృహీతవాన్।
జిత్వా శకాన్ దురాధర్షాం శ్చీన తైత్తిరిదేశజాన్॥ (డిటో ౧౮)

,, బాహ్లీకాన్ కామరూపాంశ్చ రోమజాన్ ఖురజాన్ఛ్చటాన్।
తేషాంకోశాన్ గృహీత్వాచ దండయోగ్యా నకారయత్॥ (౧౯)

,, స్థాపితా తేన మర్యాదా మ్లేచ్ఛార్యాణాం పృథక్ పృథక్।
సింధుస్థాన మితి జ్ఞేయం రాష్ట్ర మార్యస్య చోత్తమం॥౦ (౨౦)

,, మ్లేచ్ఛస్థానం పరంసింధోః కృతం తేన మహాత్మనా॥ (౨౧)

తా॥ ఈకాలములో ఉజ్జయినీ పట్టణమున" విక్రమాదిత్యుని పౌత్రుడైన "శాలివాహన మహారాజు పిత్రీయమైన రాజ్యమును చేపట్టిన వాడాయెను. ఆయనశకులను, చీనాదేశీయులను, తాత్తారులను జయించెను. బాహ్లికులను కామరూప దేశీయులను, రోమకులను, శకులైన ఖొరాసాన్ దేశస్థులను జయించి, వారు దోచుకొనిన ధన రాసులను తిరిగి వారివద్దనుండి లాగికొని వారిని దండించి దేశమునుండి కలి. 3179 సం॥ (క్రీ॥శ॥ 78 సం॥) రమున పారద్రోలెను. ఆయన మ్లేచ్ఛ, ఆర్యస్థానము

లను వేరువేరుగాచేసి వాటికి మధ్య హద్దులేర్పరచెను. మహాత్ముడైన ఆ శాలివాహన మహారాజు ఆర్యులు నివసించెడి స్థానమును (సింధునదికి తూర్పునగల భారతమును) ఉత్తమమైన సింధుస్థానమనిన్ని, సింధునదికి పశ్చిమముగాగల రాష్ట్రములు మ్లేచ్ఛస్థానమనిన్ని పేరుబెట్టెను.

ఆ సం॥ రము అనగా కలి 3179 (క్రీ॥ శ. 78 సం॥) సం॥ రము నుండి శాలివాహన శకము ప్రారంభింపబడి అమలులోనికి వచ్చినది. దీనిని "శాకే" యని యిప్పుడు మనము వ్యవహరించు చుంటిమి. "శాకే" అని సంవత్సర ముదహరించిన మనకు యిప్పుడు "శాలివాహన శకమని అర్థమిచ్చును. "సంవత్" లేక "విక్రమ" అని సంవత్సర ముదహరించిన "విక్రమార్క శకము"గా యిప్పుడు మనము వ్యవహరించు చుంటిమి. ఈ రెండు శకములకు పూర్వము కలి 2552 (క్రీ॥ పూ॥ 550 సం॥) సం॥ రములో పారశీక రాజైన సైరసు శకమొకటి ప్రవర్తితమైనది. విక్రమ శకమునకు పూర్వము వాడబడిన "శాకే" యనునది క్రీ॥ పూ. 550 సం॥ రము నుండి ప్రారంభింపబడిన "సైరసు శకము" అయియున్నది. కాని శాలివాహన శకము కానేరదు ఈ విషయమును గురించి మాచే రచింపబడిన "కలిశక విజ్ఞానం ప్రథమ భాగము"న విశేషముగా విచారింపబడినది. అచ్చట చూచుకొనగలరు.

శాలివాహన మహారాజు మ్లేచ్ఛ, ఆర్య స్థానములను నిర్ణయించి మ్లేచ్ఛులా హద్దును దాటి రాకుండునట్లు కట్టుదిట్టముచేసెను. సింధునది పశ్చిమ సరిహద్దు లగాయతు తూర్పుగా ఆర్యులు కాపురముండు ప్రదేశమునకు "సింధు స్థానమనిన్నీ, సింధు నదికి పశ్చిమమున మ్లేచ్ఛులు కాపురముండు ప్రదేశమునకు మ్లేచ్ఛస్థానమనిన్నీ మహాత్ముడైన ఆ శాలివాహన మహారాజు హద్దులను నిర్ణయించెను. శాలివాహనుడు అశ్వమేధ యాగ మొనర్చెను అరువది సంవత్సరములు రాజ్యము చేసి స్వర్గము నలంకరించెను. (3-3-౨-33)

శాలివాహనుడు అరువది సంవత్సరములు అనగా కలి 3179 సం॥ లగాయతు 3239 సం॥ వరకు క్రీ॥ శ॥ 78-138 రాజ్యముచేసి యుండెను. (భవిష్య 3-౮-౧-౨3)

# విక్రమ, శాలివాహన శకములు

వి. ఎ. స్మిత్ మహాశయుడు విక్రమ, శాలివాహన శకములను గురించి యిట్లు వ్రాసియున్నాడు:—

"క్రీ॥ పూ॥ 58-57 గల విక్రమశకముకు సంబంధించిన ఉజ్జయినీ విక్రమాదిత్యు డొకడు కలడని లోకులను కొనునది పొరబాటుతో కూడియున్నది. ఆ కాలములో అట్టిపేరుగల పురుషుడు లేడు. ప్రాచీన కాలమున మాల్వారాష్ట్రములో వాడుకలోనున్న శకము అచ్చట జ్యోతిష్కులచే యేర్పరుపబడినమాట నిజము. దాని మొదటిపేరు మాల్వాశకము. ఇటీవలి కాలమున విక్రమాదిత్యుడను బిరుదుగల రాజెవరో యొకరాశకము నేర్పాటుచేసి యున్నట్లు నమ్మబడుచున్నది. ఉజ్జయినీని క్రీ॥శ. 390 సం॥రములో జయించిన "విక్రమాదిత్య" యని బిరుదువహించిన రెండవచంద్రగుప్తునివలన యేర్పాటై యుండవచ్చునని యూహింపబడుచున్నది. ఇటీవలి కాలమున గుప్త, శక అనుశకములు పేర్లు మార్చుచేయబడి వల్లభి, శాలివాహన శకములుగా పేర్లు తబ్దీలు చేయబడినవి అనిస్మిత్ మహాశయుడు వ్రాసియున్నాడు".

(Vide the Oxford Student's His of India. P. P.80, 81. By V. A. Smith. Ed. 1915)

పాశ్చాత్య పండితులు పురాణముల నన్నిటెని వారిభాషలలోనికి తర్జుమా చేసుకొనియు, కొందరు సంస్కృతమును నేర్చుకొనియు పూర్తిగా వాటిని చదివియుండిరి. పురాణములన్నిటికి భవిష్య మహాపురాణమే మొదటిదనియు, దానినుండియే మత్స్య, వాయు, బ్రహ్మాండాది, పురాణములన్నియు రాజవంశావళులను తీసుకొన్నవనియు స్థిరపరచి యుండిరి. సంస్కృతమును చదువుకొని పురాణములను చదివి వానినుండి కలిరాజ వంశములను తీసుకొని "The Dynasties of the kings of the Kali Age" అనెడి గ్రంథమును రచించిన "పరీటరు" మహాశయుడు భవిష్య పురాణమును ప్రమాణ గ్రంథముగా నంగీకరించుచు వ్రాసి యుండిన వాక్యములను వానిని "స్మిత్" మహాశయు డనువదించుచు వ్రాసిన వాక్యములను చూడుడు:-

"Mr. F. E. Pargitar in his valuable work,

"The Dynastıes of the Kali Age (Clarendon press 1913) has succeeded in obtainig more dıfinite results. He suggests that the Bhavishya purana in its early form was the Original authority from which the Matsya, Vayu Brahmanda derived theır dynastic lists. The Versions of the lists as now found in the Matsya, Vayu, Brahmanda puranas grew out of one and the same original text."

(Vide. V. A. Smiths' Early His. of India P. 23)

తా॥ పర్గీటరు మహాశయుడు తన విలువైన గ్రంథములో కలియుగ రాజ వంశావళుల నిచ్చుటలో న్యాయమై, నిష్కర్షమైన తేదీలను నిర్ణయించెను. భవిష్య పురాణము మొదట రాజ వంశావళుల నిచ్చుటలో మిగత పురాణములకు మాతృకగా నుండెననియు, అందుండియే మత్స్య, వాయు, బ్రహ్మాండ పురాణములు రాజ వంశావళులను తీసుకొన్నవనియు, యిప్పుడు మత్స్య, వాయు, బ్రహ్మాండ పురాణముల లోని రాజ వంశావళులకు భవిష్య పురాణమే మాతృకయనియు చెప్పియున్నాడు" అని స్మిత్ మహాశయుడు వ్రాసియున్నాడు.

అట్టి ప్రమాణభూతమైన భవిష్యపురాణములోని రాజవంశావళులలో ప్రమరవంశము లేక పావ్వారువంశము అని చెప్పబడిన రాజవంశావళిలో యెనిమిదవవాడగు "విక్రమాదిత్యుడు" పదకొండవవాడగు "శాలివాహనుడు" అను రాజులసలే లేరని యెగరగొట్టి వారి శకములను శకాది అన్యదేశీయరాజుల కంటగట్టి భారత దేశ చరిత్రను చిత్రించుటలో గల రహస్యమును గ్రహింపుడు. ఇది అజ్ఞానముచేగాని, పొరబాటు వలనగాని జరిగినదిగాదనియు, బుద్ధిపూర్వకముగా యీ యిద్దరు రాజ చరిత్రలను మఱుగుపరచు నుద్దేశ్యముతో చేయబడినటుల స్పష్టముగా కనుపడుచున్నది. ఈ రాజులుకూడను సామాన్యరాజులు కారు. ఆసేతు హిమాచలముగాగల భారతభూమినంతను పరిపాలించినవారు. అందు శాలివాహన చక్రవర్తి తమ అధికారముక్రింద భారతభూమియంతయు

నున్నటుల ధృవపరచుకొనెడి నిమిత్తం అశ్వమేధ యాగ మొనర్చి దేశములోని సామంతరాజులందరిచేతను కప్పములు, కానుకలు పుచ్చుకొనియున్నాడు.

శాలివాహనుడు దిగ్విజయముచేసి తన రాజధానిని చేరుకున్న పిమ్మట—

శ్లో॥ "స్వరాజ్యం ప్రాప్తవాన్ రాజాహయమేధ మచీకరత్ ।
రాజ్యం కృత్వాసషష్ట్యబ్దం స్వర్గలోక ముపాయయౌ ॥"
(భవిష్య. 3 వ పర్వము 3 వ ఖండము రెండవ అధ్యాయం.
33 శ్లోకము) (3-3-2-33)

తా॥ అట్లు దిగ్విజయముచేసి వచ్చి తన రాజధానిని చేరుకొనిన పిమ్మట శాలివాహన మహారాజు "అశ్వమేధ"యాగ మొనర్చెను. అరువది సం॥రములు రాజ్యముచేసి స్వర్గలోకమును పొందెను. విక్రమాదిత్యుడును, ఆతని మనుమడు శాలివాహనుడును ఉభయులు శక స్థాపకులై యుండిరి. కలి 3044 (క్రీ॥పూ. 58-57) సంవత్సరములో విక్రమార్క శక స్థాపన జరిగియున్నది. ప్రతి పంచాంగములోను ప్రతిసంవత్సర ముదహరింపబడుచునే యున్నది. దీని ఆయుఃకాలము 135 సం॥రములు. అనగా దీనికి పిమ్మట 135 సం॥రములకు వేరొక శకము పుట్టునని తాత్పర్యము. ఒక ప్రసిద్ధశకము పుట్టగనే దానికి పూర్వ ముండిన శక మంతరించుట ఆచారము. అటులనే విక్రమశకమునకు పిమ్మట 135 సం॥రములకు "శాలివాహనశకము" కలి 3179 (విక్రమశకం 3044 + 135 = కలి 3179) సంవత్సరములో ప్రారంభింపబడినందున విక్రమశక మంతటితో అంతరించి నట్లెంచవచ్చును. కాని "సంవత్" అను పేరున విక్రమశకమును ఘూర్జరాది రాష్ట్రములలో నేటికిని వాడుచునే యుండిరి. శాలివాహనశకము భారతదేశ మందంతటను నేటికికూడా ప్రచారము గలిగియున్నది.

ఇట్టి శకకర్తలనుబయటికి రానీయక వారి స్థానములో ఎప్పుడో అతి స్వల్పకాలము, అత్యల్ప రాష్ట్రమును పాలించినశకరాజుల నుంచి గొప్ప

జేయుచు వారే ఆ శకములకు కర్తలైయుండురని ఊహాగానములను జేసి సందేహాస్పదమైన వాక్యములతో చెప్పియుండిరి. శాలివాహన శకమును గురించి "స్మిత్" మహాశయుని అభిప్రాయము చూడుడు:—

"Opinions differ, but it is probable that the Saka Era of A. D. 78 dates from the accession or coronation of Kanishka, the Saka King.

In latter ages the Era was known as that of Salivahana" (The Oxford Students, His. of India. P. 74. By V. A. Smith. E. D 1915.)

తా॥ శాలివాహన శకమును గురించి అభిప్రాయ భేదములున్నను క్రీ॥ శ. 78 సం॥ రమున గల శకము శకరాజైన కానిష్కుడు సింహాసనమునకు వచ్చిన లేక పట్టాభిషేకమును పొందిన సంవత్సరము నుండి ప్రారంభింపబడియుండుట సంభవము కావచ్చును. ఇటీవలి కాలమున ఆ శకము శాలివాహన శకముగా యెంచబడినది అని 'స్మిత్' మహాశయుడు వ్రాసియున్నాడు.

ప్రజలలో సాంప్రదాయ సిద్ధముగా వచ్చుచుండినట్టియు, ప్రతి సంవత్సర పంచాంగములలో యుదహరింపబడు చుండినట్టియు, భవిష్య పురాణములో విశేషముగా వర్ణింపబడినట్టియు, విక్రమ, శాలివాహన శకకర్తలసలే లేరనియు, ఆశకములు శకరాజులవి కావచ్చుననియు తమ యూహాబలముచే కల్పనలుచేసి గ్రంథములలో వాటిని స్థిరమైన సిద్ధాంతములుగా నెక్కించి, పిల్లలకు పాఠశాలలలో నేర్పి తమ ప్రాచీన వాఙ్మయమును తామే నిరసించుకొనుచు తమ దేశమును గూర్చి అచారిత్రకమైన అసత్య చరిత్రలను వ్రాయువారినిగా మనవారిని తయారుచేసిరి.

## "పర్గిటరు"ని కలిరాజ వంశావళి

పాశ్చాత్య చరిత్రకారు లెవరును అగ్నివంశపురాజుల వంశావళి నిచ్చియుండలేదు. కలిరాజ వంశావళియను గ్రంథమును వ్రాసిన "పర్గిటరు" మహాశయుడు తనరాజ వంశావళులను భవిష్య పురాణము నుండి తీసుకొ

నియు, ఆ పురాణము నితర పురాణములతో సరిచూచుకొనియు, అందు గొప్పగా వర్ణింపబడిన ప్రసిద్ధులైన విక్రమార్క, శాలివాహన, భోజ రాజులు గల ప్రమర, లేక పొన్వారు లేక పరమార అను పేర్లతో చెప్ప బడుచుండిన రాజవంశావళిని తన గ్రంథములో నీయక విడచియుండెను. అట్లు విడచుటకు కారణమునైనను యిచ్చినవాడు కాడు. అట్టివంశ మొకటున్నటుల సూచనమైనను చేసియుండలేదు. సత్యమును వెల్లడిం చకపోగా దానిని మరుగుపరచి జనులలో సాంప్రదాయానుసారముగా వచ్చుచుండిన సంస్కారమును నాశనము చేయుట కట్టి రాజులెవరును ఆ కాలములో లేరని పాశ్చాత్య చరిత్రకారులు ప్రచారము చేయుచు, తమ చరిత్రల నింపియుండిరి. ఇది గర్హింపతగిన విషయము.

చరిత్రలు వ్రాయునపుడు సందిగ్ధముగానున్న తావులందు తమకు తోచిన విధమున నిర్ణయముల చేయుటలో పొరబాట్లు పడివుండవచ్చును గాని, ప్రాచీన చరిత్రలలో స్పష్టముగా చెప్పబడియుండిన యంశములను కప్పివుచ్చి వాటిని బహిరంగపరచకపోవుటయేగాక వాటిని తారుమారు చేసి చరిత్రలలో నెక్కించి చరిత్రలను కళంకితమొనరుట న్యాయము కాదని చెప్పవలసివచ్చినందుకు క్షమింప వేడుచుంటిమి.

## భోజరాజు

శ్లో॥ "శాలివాహన వంశేచ రాజా నోదశచాభవన్
రాజ్యం పంచశతాబ్దం కృత్వాలోకాంతరం యయుః ॥
భవిష్య (3-3-3-౧)

,, మర్యాదాక్రమతోలీనా జాతా భూమండలే తదా ।
భూపతిర్దశమో యోవై భోజరాజ ఇతిస్మృతః ॥
దృష్ట్వాప్రక్షీణ మర్యాదాంబలీ దిగ్విజయం యయా॥ (3-3-3-౨)

,, సేన యాదశసాహస్ర్యా కాళిదాసేన సంయుతః
తథాన్యైర్బ్రాహ్మణైః సార్థం సింధుపారము పాయయా॥ (3-3-3-3)

,, జిత్వాగాంధారజాన్ మ్లేచ్ఛాన్ కాశ్మీరాన్నార వాన్శటాన్ ।
తేషాంప్రాప్య మహాకోశం దండయోగ్యాన కారయత్"॥ (3-3-3-౪)

తా॥ శాలివాహనుని వంశమందు పదిమంది రాజులైరి. వారు 500 సం॥ రములు రాజ్యముచేసి స్వర్గమును పొందిరి. వారి కాలమున వైదిక ధర్మము క్షీణించిపోయెను. వారిలో పదవవాడు "భోజరాజు" దేశమున ధర్మము క్షీణించుటచూచి భోజరాజు బలములను గూర్చుకొని దిగ్విజయమునకు బయలుదేరెను. పదివేల సైన్యమును కూర్చుకొని, కాళిదాసుతో గూడినవాడై, అనేకులైన విద్వద్బ్రాహ్మణులను వెంట గొని సింధునదీతీరప్రాంత దేశముల జయించెను. అటుపిమ్మట గాంధారము లోని మ్లేచ్ఛులను, కాశ్మీరము, ఆరవము (ఆరియా కావచ్చును) వరకుగల శఠులైన మ్లేచ్ఛజాతులను జయించి వారిని దండించి వారినుండి అమిత ధనరాసులను (వారదివరకు భారత దేశమునుండి కొల్లగొని పోయిన ధనరాసులను) పొందెను.

శాలివాహనుని వంశమందు పదిమంది రాజులు వచ్చియుండిరి, అందు పదవరాజు "భోజరాజు" గొప్ప ప్రఖ్యాతి గలిగిన బలవంతుడైన రాజు. ఆతడు దిగ్విజయమునకు పోయి ఉత్తరదేశమునే గాక గాంధా రము, కాశ్మీరము, ఆరవము (లేక ఆరియా దీనికి హీరటు ముఖ్యపట్టణం) మొదలుగాగల దేశములను జయించి వారి వద్దనుండి బహుళ ధనరాసు లను పొందెను. శాలివాహనునికిని, భోజరాజుకును మధ్యరాబడిన తొమ్మండుగురు రాజులు యెక్కువ ప్రతిష్ఠ నార్జించిన వారుకారు. శాలివాహనుని అనంతరం భోజరాజుతో సహా గల పదిమంది రాజులు అయిదు వందల సం॥ రములు రాజ్యముచేసినట్లు పురాణమున గలదు పూర్ణసంఖ్యగా నుండుటకు అయిదు వందలని చెప్పబడినది గాని ఆ సంఖ్యలో యింకను 56 సం॥ రములను చేర్చి 556 సం॥ రములని చెప్పవలసియున్నది. శాలివాహనుడు కలి. 3179 లగాయతు 3239 సం॥ వరకు (క్రీ॥ శ 78-138) అరుది సంవత్సరములు రాజ్యముచేసి యుండెను. క్రీ॥ శ 138 సం॥ రములకు శాలివాహనునికి పిమ్మట భోజరాజు ఆఖరు వరకు రాబడిన రాజులు పదిమందికి అయిదు వందల సం॥ రములు గా మాత్రమే తీసికొనిన (138 + 500 = ) క్రీ॥ శ 638 సం॥ వచ్చును. భోజరాజు యేబది సం॥ రములు రాజ్యమేలి యుండెను. అనగా

క్రీ॥ శ 578–638 సం॥ అగును. క్రీ॥ శ 606–648 సం॥ రం వరకు
శ్రీ హర్షశిలాదిత్యుడుండి రాజ్యముచేసి యున్నాడు. చైనా యాత్రికుడు
హౌనుత్సాంగ్ కాలములో ఆతని ఆస్థాన మందుగలడు. వారితో
సమకాలికుడుగా "భోజరాజు" కూడా వుండవలసి వచ్చును.

శ్రీ హర్ష శిలాదిత్యునివలె భోజరాజు కూడను ఉత్తర హిందూ
స్థానము నంతను జయించి యుండెను. ఈ ఉభయులు సమకాలికులైన
ప్రత్యర్థులుగా నుండి యుండెడివారు శ్రీ హర్ష శిలాదిత్యుడు "ఉజ్జయనీ"
రాజ్యము (మాల్వా)ను లోబరుచుకొని యుండెను. ఇరానును కూడను
జయించి లోబరుచుకొనిన "భోజరాజు" శ్రీ హర్షునికి లోబడి యుండె
ననుమాట చెల్లదు. కనుక కాలమును మొత్తముగా చెప్పుటలో
పురాణము టూకీగా అయిదు వందలని చెప్పిన సంఖ్య తొమ్మండు
గురు రాజులకిచ్చి భోజరాజుకు 56 సం॥ రము లిచ్చిన కాలము సరిగా
సరిపోవును. మహమ్మదీయులతో యీ అగ్నివంశపు రాజులకు జరిగిన
"కురుక్షేత్ర యుద్ధము" (స్థానేశ్వర యుద్ధము) క్రీ॥ శ 1193 సం॥ రములో
జరిగి యున్నది పురాణములో చెప్పబడిన 500 సం॥ రములనే తీసికొనిన
1193 సం॥ రము నాటికి 56 సం॥ రములు తరుగు చున్నది. దీనిని సరి
చేయుటకు యీ 56 సం॥ లు చేర్చుకొనక తప్పదు. శాలివాహనునికి
పిమ్మట రాబడిన పదిమంది రాజులకు చెప్పబడిన 500 లకు యీ 56 సం॥
కలిపిన 556 సం॥ రము లగును. అప్పుడు "భోజరాజు" కాలము
శ్రీ హర్ష శిలాదిత్యునికి పిమ్మట రాగలదు. ఇట్టి సవరణవల్ల కురుక్షేత్ర
యుద్ధము నాటికి క్రీ॥ శ. 1193 సం॥ రముకు గల తరుగుకూడా భర్తియై
సరియైన కాలనిర్ణయము జరుగగలదు. కనుక శాలివాహనునికి పిమ్మట
వచ్చిన తొమ్మిది మందికి 500 సం॥ రములును భోజరాజు సహా పదు
గురు రాజులకు 556 సం॥ రములని నిర్ణయించబడినది.

భోజరాజు కాలము (కలి 3239 + 556) = కలి 3795 సం॥ రము
వరకు నగును. ఈతడు 56 సం॥ రములు రాజ్యముచేసి యున్నాడు.
(కలి 3795—56) 3739 లగాయతు 3795 వరకు నగును.

(క్రీ॥ శ 637—693 సం॥ వరకూ)—

ప్రమరవంశములో 10 వ రాజు పేరు చెప్పబడ లేదు.
ప్రమరవంశములో 11 వ వాడు శాలివాహనుడు
,, 12 వ వాడు శాలిహోత్రః
,, 13 వ వాడు శాలివర్ధనః — (యీాతనికి "శకహంత" అని బిరుదుగలదు)
,, 14 వ వాడు సుహోత్ర
,, 15 వ వాడు హావిర్హోత్ర
,, 16 వ వాడు ఇంద్రపాల (ఈతడు "ఇంద్రావతీ" పట్టణ మును నిర్మించి అచ్చట నుండి పరిపాలించెను.)
,, 17 వ వాడు మాల్యవాౕ (ఈతడు మాల్యవంతమను పట్టణమును నిర్మించెను. ఈతని కాలములో 4 సం॥ రములు అనావృష్టి కలిగి నది.)
,, 18 వ వాడు శంభుదత్త
,, 19 వ వాడు భౌమరాజ
,, 20 వ వాడు వత్సరాజ
,, 21 వ వాడు భోజరాజు

శాలివాహనునికి పిమ్మట భోజరాజు ఆఖరుకు రాబడిన రాజులు పదిమంది. రాజ్యకాలం 556 సం॥రములు. కలి 3239 — 3795 క్రీ. శ. 138 — 693 — 694 వరకు—

## వీరసింహుడు

కలి 3795—4095 (క్రీ. శ. 693—993 వఱకు)

శ్లో॥ "స్వర్గతే భోజరాజేతు సప్తభూపాస్త దన్వయే
జాతాశ్చాల్పాయుషో మందాస్త్రి శతాబ్దాంత రేమృతాః॥(3—3—౪—౧)

,, బహుభూపవతీ భూమిస్తేషాం రాజ్యే బభూవహ
వీరసింహశ్చ యోభూపః సప్తమః సంప్రకీర్తితః॥ (౨)

తా॥ భోజరాజు కలి 3795 (క్రీ॥ శ. 693 సం॥)న చనిపోయిన పిమ్మట ఆతని వంశమున అల్పాయుష్కులు, మందులు నగు రాజులు యేడుగురు పుట్టి మూడువందల సంవత్సరములు రాజ్యము చేసియుండిరి. వారి రాజ్యకాలమున సామంతులందరు స్వతంత్రులైనందున అనేక రాజ్యములేర్పడినవి. అందు ఆఖరు రాజును ప్రతిష్ఠావంతుడును నగు "వీరసింహ" అనెడి రాజు ఏడవరాజు. కలి 3795 + 300 = 4095 సం॥ (క్రీ॥ శ. 693 + 300 = 993 సం॥) వీరసింహుడు క్రీ॥ శ. 933 లగాయతు 993 వరకు రాజ్యమేలి గతించెను. ఈతనికి "భూమి పాల" అని కూడ పేరుగలదు.

21 భోజరాజుకు పిమ్మట ఆ వంశమున రాబడిన రాజులు
22 శంభుదత్త
23 బిందుపాల (ఈతడు "బిందుఖండరాష్ట్ర"మును సంపాదించెను)
24 రాజపాల
25 మహీనర
26 సోమవర్మ
27 కామవర్మ
28 భూమిపాల (ఈతడనేక రాజులను జయించినందున "వీర సింహ" అని బిరుదును పొందెను.

ఈ యేడుగురు మూడువందల సంవత్సరములు రాజ్యము చేసియుండిరి అని పురాణము స్పష్టముగా చెప్పుచున్నది. కలి 3795—4095 సం॥ (క్రీ॥ శ. 693—993 సం॥) వరకు—

## గంగసింహ

శ్లో॥ తదన్వయే త్రిభూపాశ్చ ద్విశతాబ్దాంతరే మృతాః
గంగాసింహశ్చ యోభూపో దశమః యోప్రకీర్తితః॥(3–3–౪–3)

తా॥ వీరసింహుని వంశమున ముగ్గురు రాజులు రెండు శతాబ్దముల కాలములోనే రాజ్యములుచేసి గతించిరి.

భోజరాజు వంశములో (7 + 3 = )10 మంది రాజులు వచ్చి యుండిరి. అందు పదవవాడు గంగా సింహుడు.

28 "భూమిపాల" "లేక వీరసింహ" అనువాని సంతానం.

29 రంగపాల

30 కల్పసింహ

31 గంగాసింహ:-ఈతడు 90 సం॥ రముల వృద్ధుడు. సంతతిలేదు. కురుక్షేత్రమందు మ్లేచ్ఛులతో జరిగిన యుద్ధమునందు వీర మరణము నొందెను.

శ్లో॥ "నవత్యబ్ద వపుర్భూత్వాసోఽన పత్యోరణంగతః
త్యక్త్వా ప్రాణాన్ కురుక్షేత్రే స్వర్గలోక మవాప్తవాన్ ॥
సమాప్తిమగ మద్వీప్ర ప్రమరస్య కులం శుభం" ॥
(భవిష్య. 3-4-1-44)

తా॥ తొంబది వత్సరములు గల వృద్ధశరీరుడై, సంతతిలేనివాడై యుద్ధమునకు బోయెను. కురుక్షేత్రమున (మ్లేచ్ఛులతో) జరిగిన యుద్ధమున ప్రాణములను వీడి స్వర్గమును పొందెను. పవిత్రమైన ప్రమరుని యొక్క వంశమింతటితో అంతమయ్యెను. మ్లేచ్ఛులతో పృథ్వీరాజాది అగ్నివంశపు రాజులకు జరిగిన కురుక్షేత్రయుద్ధము కలి 4295 (క్రీ శ.1193) సంవత్సరము చివర ముగ్గురు రాజులు రాజ్యము చేసిన కాలము 200 సం॥ గములు కలి 4095-4295 (క్రీ॥శ. 993-1193) వరకు.

శ్లో॥ తదన్వయేచయే శేషాః క్షత్రియాస్తదనంతరం।
తన్నారీష్వమితో విప్రబభూవవర్ణసంకరః॥ (భవిష్య. 3-4-1-45)
,, "వైశ్యవృత్తికరాః సర్వేమ్లేచ్ఛతుల్యామహీతలే।
ఇతితే కథితం విప్రకులందక్షిణభూపతేః॥" (భవిష్య. 3-4-1-46)

తా॥ ప్రమరవంశములో మిగిలినవారందరు కురుక్షేత్ర యుద్ధానంతరం (బ్రాహ్మణాచారములు వీడినవారైనందున) క్షత్రియులుగా పరిగణింపబడిరి. ఆ కులమందు (పురుషులు యుద్ధంలో మరణించినందున)

గల స్త్రీలు వర్ణసంకరులైరి. ఆ వంశములోని వారందరు వైశ్యవృత్తి కరులై మ్లేచ్ఛతుల్యులైరి. దక్షిణదేశమును పాలించిన ప్రమరుని వంశము చెప్పబడినది.

## అగ్నివంశపు రాజుల ధర్మపరిపాలన

కలి 4295 సం॥న (క్రీ॥ శ॥ 1193 సం॥రము) మహమ్మదుగోరి, పృథ్వీరాజుల యుద్ధము. ఆ యుద్ధకాలమునకు పూర్వపు దేశస్థితిని, అగ్ని వంశపు రాజులు లేక బ్రహ్మక్షత్రరాజులు లేక నియోగ బ్రాహ్మణ ప్రభువుల పరిపాలనాదుల నిట్లు పురాణము తరువాతి శ్లోకములలో చెప్పుచున్నది.

శ్లో॥ కల్పక్షేత్రేచరాజ్యం స్వంకృతవాన్ ధర్మతోనృపః।
అంతర్వేద్యాం కాన్యకుబ్జే జయచంద్రోమహీపతిః॥
(భవిష్య 3-3-౪-౪)

,, ఇంద్రప్రస్థే నంగపాల స్తోమరాన్వయ సంభవః।
అన్యేచబహవోభూపా బభూవుర్గ్రామరాష్ట్రపాః॥ (౫)

,, అగ్నివంశస్య విస్తారో బభూవ బలవత్తరః।
పూర్వేతుకాపిలస్థానే వాహీకాంతేతు పశ్చిమే॥ (౬)

,, ఉత్తరేచీనదేశాంతే సేతుబంధేతు దక్షిణే।
షష్ఠిలక్షాశ్చభూపాలా గ్రామపాబలవత్తరాః॥ (౭)

,, అగ్నిహోత్రస్య కర్తారో గోబ్రాహ్మణహితైషిణః।
బభూవుర్ద్వాపర సమాధర్మకృత్య విశారదాః॥ (౮)

శ్లో॥ ద్వాపరాఖ్య సమఃకాలః సర్వత్ర పరివర్తతే
గేహే గేహేస్థితం ద్రవ్యం ధర్మశ్చైవ జనేజనే॥ (౯)

,, గ్రామే గ్రామేస్థితో దేవో దేశేదేశే స్థితోమఖః
ఆర్యధర్మ కరామ్లేచ్ఛా బభూవుః సర్వతోముఖాః॥ (౧౦)

తా॥ గంగాసింహుడనెడి ప్రమర వంశములోని ఆఖరు రాజు కురుక్షేత్రమందు ధర్మముగా రాజ్యపాలన చేయుచుండెను. అంతర్వేది

రాష్ట్రమునకు ముఖ్యపట్టణమగు "కన్యాకుబ్జము"నందు జయచంద్రుడు రాజ్యము చేయుచుండెను. ఇంద్రప్రస్థమున తోమరవంశ సంభవుడగు అనంగపాలుడు రాజ్యముచేయుచుండెను. రాష్ట్రముల, గ్రామముల నేలెడి రాష్ట్రపాలురు, గ్రామపాలురు అనేకులు గలరు. అగ్నివంశము విస్తరించి దేశబాహుళ్యము గలదియై బలమైనదిగా నేర్పడెను. దాని హద్దులు—

తూర్పు— కపిల స్థలము (కపిలవస్తు రాష్ట్రము)

పశ్చిమము— బాహ్లీక రాష్ట్రము "సింధునది, దాని ఉపనదులు కలిసిన ప్రదేశమున సింధునది తూర్పు నుండి ఆ నది పశ్చిమమువరకు గలదు.

ఉత్తరము— "చీన" దేశము వఱకు

దక్షిణము— సేతుబంధము

హద్దులుగా గల దేశమునంతను అగ్నివంశస్థులగు బ్రహ్మక్షత్ర రాజుల పరిపాలనలో నుండియున్నది. అరువది లక్షలుగా గల గ్రామ పాలన చేయు బ్రహ్మ క్షత్రరాజులు వారి యుద్యోగి బృందము సహా బలవంతులుగా నుండిరి. ఆ బ్రహ్మక్షత్రు లందరు అగ్నిహోత్రముల నిత్యము నుపాసించుచుండెడివారు. గో బ్రాహ్మణుల నెల్లపుడు కాపాడుచు వారి హితమును గోరుచుండెడివారు. తమ తమ స్వధర్మముల నెఱిగి ప్రజలు ధర్మాచరణమునందు ద్వాపరయుగ పురుషులవలె సంచరించుచుండిరి. దేశమంతటను ద్వాపరయుగ ధర్మ మర్యాదలన్నియు ప్రజలచే నెఱపబడుచుండెడివి. ప్రతియింటను తగినంత ద్రవ్యము గలదు. ప్రతి మనుష్యుడు తన కులోచిత, ఆశ్రమోచిత ధర్మము నెఱవేర్చుచుండెడివాడు. ప్రతి గ్రామమున దేవాలయమున్నది. ప్రతి దేశమున యజ్ఞము లాచరింపబడుచున్నవి. మ్లేచ్ఛులు కూడను (తమకు నైజమగు హింసాకార్యముల నొదిలి దయాసత్య శౌచాదులు గలిగినవారై) అన్ని విధముల ఆర్యధర్మములనే అనుసరించుచుండిరి. మ్లేచ్ఛరాజు లీ దేశమున రాజ్యస్థాపనలు చేయునాటికి భారతదేశము పై తీరున ధర్మనిష్ఠ కలిగి యున్నటుల స్పష్టము చేయబడినది.

ఈ అగ్నివంశము క్రీ॥ పూ॥ 392 ఆ ప్రాంతముల ప్రారంభమైనది. కాని ఆ వంశావళులలో ప్రథమమున రాజ్యములు చేసిన వారినందరిని చెప్పినటుల కనుపడదు, మూలపురుషులకు పిమ్మట కొద్దిమంది మాత్రమే చెప్పబడినటుల కాన్పించుచున్నది. రెండు శతాబ్దముల కాలము మనకు గన్పించుటలేదు వివరములు చెప్పబడినచోట ప్రమరవంశములో విక్రమార్కుడు కలి. 3000 సం॥ రములు గడిచిన పిమ్మట పుట్టినటుల స్పష్టముగా చెప్పబడి యుండుటవలనను, విక్రమార్కునికి పూర్వము ఆ వంశములో ఆఱుగురు రాజులు అల్పకాలము రాజ్యముచేసినటుల చెప్పబడి యుండుట వలనను ప్రమరవంశము విక్రమార్కునికి పూర్వము 9[illegible] సం॥ రములు మాత్రము "ఉజ్జయినీ" యందు రాజ్యము చేసినటుల కాన్పించుచున్నది. కాని ప్రమరవంశ కథన ప్రారంభమున

శ్లో॥ "సప్తవింశతిశతే వర్షేదశాబ్దే చాధికేకలౌ.
ప్రమరోనామ భూపాలః కృతం రాజ్యంచషట్సమాః ॥

భవిష్య. (3-1-7-78)

కలిలో 2710 సంవత్సరములు గడిచిన పిమ్మట ప్రమర మహారాజు ఆఱు సంవత్సరములు రాజ్యముచేసి యుండెనని చెప్పబడి యుండుటవలనను, ఆతని తరువాత వచ్చిన 2. మహామర. 3. దేవాపి. 4. దేవదూత యీ ముగ్గురు మూడేసి సంవత్సరములు మాత్రమే రాజ్యముచేసి శకాది మ్లేచ్ఛులచే వధింపబడిరని చెప్పబడియుండుట వలనను ఉజ్జయినీ రాజ్యమును శకులు జయించి కొంతకాలము రాజ్యము చేసియుండుటయు, ప్రమరవంశపు రాజులు శ్రీశైలమునకు మారుటయు, జరిగిన కలి 27 5-29 0 వరకు (క్రీ॥ పూ. 377-182 వరకు) కాలమున గల కొందరు రాజులను చెప్పక పురాణము వదిలినటుల కనిపించుచున్నది.

కలి 2725 (క్రీ॥ పూ 377 సం॥) లగాయతు కలి 2782 సం॥ (క్రీ॥ పూ. 320 సం॥) వరకు శకులు మాల్వారాష్ట్రమును పరిపాలించినట్లు కనుపించుచున్నది. కలి 2782 (క్రీ॥పూ. 320 సం॥ సముద్రగుప్తుడు వారలను జయించి వారల నీ దేశమునుండి వెడలగొట్టి యుండెను.

పిమ్మట కొంతకాలమునకు శకాదిపరదేశీయులలో "కుషాను"లనెడి వారు మాల్వారాష్ట్రమును జయించి పరిపాలించు చుండిన కాలమున కలి 2845 సం॥ (క్రీ॥ పూ, 257 సం॥ రములో కుషానుల జయించి రెండవ చంద్రగుప్తుడు "మాల్వా"ను తన సామ్రాజ్యములో కలుపు కొనెను. (ఈతడు క్రీ॥ పూ 269– 33 సం॥ వరకు పరిపాలించు యుండెను) తిరిగి మాల్వారాష్ట్రమును కలి 3020 సం॥ (క్రీ॥ పూ. 82 సం॥ రమున "విక్రమాదిత్యుడు" జయించి ప్రమరవంశపు రాజధానిగ చేసుకొనెను. అటుపిమ్మట శాలివాహన, భోజరాజాదు లాదిగాగల ప్రమర వంశపు రాజులు క్రీ॥ శ 1193 సం॥ వరకు దానినే రాజధానిగా నుంచుకొని దక్షిణ దేశము నంతను పరిపాలించిరి.

## ప్రమరవంశపు రాజులు

విక్రమార్కుని జననము కలి శకం మూడువేల పకటవ సంవత్సరము. ఆయన అప్పటి ఉజ్జయినీ రాజులైన శకరాజుల నోడించి ఉజ్జయినీ పట్టణమున పట్టాభిషిక్తుడగుట కలి 3020 సం॥ రము విక్రమ శక స్థాపన కలి 3044–45 సంవత్సరం. విక్రమార్కుని జననమునకు 290 సం॥రములకు పూర్వము అగ్నివంశముల స్థాపన జరిగియున్నది. ఆ కాలమున ఉజ్జయినీలో రాజ్యము చేసిన ప్రమరవంశపు రాజులు ఆఱుగురు 95 సం॥ రములు లెక్కకు వచ్చుచున్నవి. మిగతా 195 సం॥ రములలో రాజ్యములు చేసినవారి పేర్లు, కాలములు చెప్పబడియుండ లేదు. విక్రమార్కుని జననకాలముకు పూర్వము 290-సం॥ రములు ప్రమర వంశమువారు రాజ్యము చేసియున్నటుల గాన్పించుచున్నది వారితోపాటు మిగతఅగ్ని వంశములవారును రాజ్యములు చేసియుండిరి. విక్రముని జననమున కిటీవల 1195 సం॥ రములు రాజ్యము చేసి కలి 4295 సం॥ క్రీ॥ శ॥ 1193 లో ఆ నాలుగు అగ్నివంశములు భారతదేశ స్వాతంత్ర్య రక్షణమునకు మ్లేచ్ఛులతో పోరాడి తమ ప్రాణముల నర్పించి స్వర్గమును చేరిరి.

ప్రమర వంశము రాజ్యమునకు వచ్చిన కలి 2710 సం॥ లగాయతు కలి 4295 సం॥ వరకు (క్రీ॥ పూ. 392—క్రీ॥ శ. 1193 వరకు) 1585 సం॥ర

ములు రాజ్యము చేసిన రాజులలో ప్రముఖులు ముగ్గురు. (1) విక్రమార్కుడు, (2) శాలివాహనుడు, (3) భోజరాజు. అందు విక్రమార్క-శాలివాహనులు ఆసేతు హిమాచలముగా గల భారతదేశము నంతటిని జయించి చక్రవర్తులుగా పరిపాలించి, విక్రమ, శాలివాహన శకముల నేర్పాటుచేసి యుండిరి. శాలివాహనుడు అశ్వమేధయాగ మొనర్చి యుండెను. ఇట్టి ప్రసిద్ధ రాజుల చరిత్రలను బయటకు రానీయకపోగా అట్టి పేర్లుగలవారసలే లేరని చరిత్రలలో నెక్కించుటమహా సాహసము. ఇప్పటికైనను భారతచరిత్రకారులు వీరిచరిత్రలనువ్రాసి ప్రకటించుటత్యవసరము.

## ప్రమరవంశ వృక్షము

| సంఖ్య | రాజుల పేర్లు | రాజ్యం చేసిన కాలము | కలిశకం సం॥రములు | క్రీస్తుశక సం॥రములు |
|---|---|---|---|---|
| 1. | ప్రమర | 6 | 2710 2716 వరకు | క్రీపూ. 392—386 |
| 2. | మహామర | 3 | 2716–2719 | 386—383 |
| 3. | దేవాపి | 3 | 2719–2722 | 383—380 |
| 4. | దేవదూత | 3 | 2722–2725 | 380—377 |
| 5. | ఉజ్జయినీనుండి పోయి శ్రీశైలములోరాజ్యం చేసిన రాజులకాలము | 195 | 2725–2920 | 377—182 |
| 6. | గంధర్వసేనుడు | 50 | 2920–2970 | 182—132 |
| 7. | శంఖమహారాజు | 30 | 2970–3000 | 132—102 |
| | శంఖునిమరణానంతరం తిరిగి గంధర్వసేనుడు | 20 | 3000–3020 | 102—82 |
| 8. | గంధర్వసేనుని రెండవ కుమారుడు "విక్రమాదిత్య"జననం కలి 3001 సం॥ పట్టాభిషేకం ఉజ్జయినీయిలో 3020 సం॥ | 100 | 3020–3120 | 81—క్రీ. శ. 19 |

| వరుస నెం. | రాజుల పేర్లు | రాజ్యం చేసిన కాలము | కలిశకం సం॥రములు | క్రీస్తుశక సం॥రములు |
|---|---|---|---|---|
| 9. | దేవభక్త | 10 | 3120–3130 | 19— 29 |
| 10. | చెప్పబడనిరాజు | 49 | 3130–3179 | 29— 78 |
| 11. | శాలివాహనుడు | 60 | 3179–3239 | 78—138 |
| 12. | శాలిహోత్ర | | | |
| 13. | శాలివర్ధన | | | |
| 14. | సుహోత్ర | | | |
| 15. | హావిర్హోత్ర | | | |
| 16. | ఇంద్రపాల | 556 | 3239–3795 | 138–693– |
| 17. | మాల్యవాన్ | | | 694 |
| 18. | శంభుదత్త | | | |
| 19. | భౌమరాజు | | | |
| 20. | వత్సరాజు | | | |
| 21. | భోజరాజు | | | |
| 22. | శంభుదత్త | | | |
| 23 | బిందుపాల | | | |
| 24. | రాజపాల | | | |
| 25. | మహీనర | | | |
| 26. | సోమవర్మ | 300 | 3795–4095 | 693—993 |
| 27. | కామవర్మ | | | |
| 28. | భూమిపాల లేక వీరసింహా | | | |
| 29. | రంగపాల | | | |
| 30. | కల్పసింహా | 200 | 4095–4295 | 993–1193 |
| 31. | గంగసింహా | | | వరకు |

కలి 4295 సం॥ (క్రీ॥ శ. 1193 సం॥) రములో మ్లేచ్ఛులతో జరిగిన కురుక్షేత్ర యుద్ధమందు అగ్నివంశముల రాజులందరు నశించిరి.

## చయహాని లేక వయహాని వంశము

చయహాని మహారాజు మధ్యదేశము (రాజపుత్ర స్థానము)న అజ్మీరు పట్టణమున నివసించి పది సంవత్సరములు రాజ్యపాలన మొనర్చెను. ఈతనికి యిద్దరు కుమారులు. తోమర సమల దేవులను, వారలు. అందు తోమరుడు ఇంద్రప్రస్థ రాజ్యమును సంపాదించి (ఢిల్లీ) పరిపాలించెను. తోమరుని సంతతిని గురించి పురాణమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ "తదన్వయేచయే జాతాస్తోమరాః క్షత్రియాస్మృతాః ॥
(భవిష్య 3-౪-౨-౪.)

తా॥ తోమరుని వంశములో పుట్టిన వారందరు క్షత్రియులైరి.

శ్లో॥ తోమరావర జశ్చైవ చయహాని సుతః శుభః ।
నామ్నా సామలదేవశ్చ ప్రశితోఽ భూన్మహీతలే ॥ (౫)

తా॥ (తోమరమహారాజు ఇంద్రప్రస్థమునకు పోయి రాజైనందున) చయహాని మహారాజు కుమారుడై, తోమరునికి తమ్ముడైన సామల దేవుడనువాడు అజ్మీరులో రాజై పరిపాలించెను. ఈ సామలదేవుని వంశము క్రీ॥ శ 1193 సం॥ రములో మ్లేచ్ఛులతో చేయబడిన యుద్ధములో నశించువరకు బ్రహ్మక్షత్రులుగానే యుండిరి. తోమరుని వంశము వారు క్రమముగా బ్రాహ్మణాచారములు వదిలి క్షత్రియులైరి. అందువలన చయహాని సామలదేవ వంశము అని చెప్పబడవలయును గాని తోమరవంశమని చెప్పకూడదు. ఈ గ్రంథకర్తచే వ్రాయబడిన కలిశక విజ్ఞాన తృతీయ భాగమున "తోమర లేక వయహాని వంశమ"ని వ్రాయబడినది. అది పొరబాటు పురాణమును వివరముగా చూచిన పిమ్మట యీ పొరబాటు గ్రహింపబడినది కనుక చయహాని కుమారులలో జ్యేష్ఠుడైన తోమరమహారాజు (ఢిల్లీ) ఇంద్రప్రస్థమును సంపాదించి అచ్చట నివసించి రాజ్యపాలన మొనర్చెననియు ఆతనికి పిమ్మట నాతని సంతానమంతయు క్రమముగా క్షత్రియులుగా నైరనియు తెలిసినందున దానిని వదలి చయహాని యొక్క రెండవ కుమారుడును పిత్రీయమైన ఆజమేరు రాష్ట్రమును పరిపాలించిన వాడును నైన "సామలదేవుని" వంశముగా చదువుకొన ప్రార్థన.

అజమేరు రాజ్యమును పరిపాలించిన "చయహాని, సామలదేవుల" వంశములో ఆఖరు రాజులు (1) దుంధుకార. (2) కృష్ణకుమారక, (3) పృధ్వీరాజు. ఈ పృధ్వీరాజుకు మాతామహుని ద్వారా "ఢిల్లీ" రాజ్యము సంక్రమించినది. దుంధుకారునికి "మధుర" రాజ్యమున్నూ కృష్ణకుమారకునికి "అజ్మీరు" రాజ్యము వచ్చినది ఈ పృధ్వీరాజు మహమ్మదీయులతో క్రీ॥ శ. 1193 సం॥ రమున జరిగిన యుద్ధములో చంపబడినాడు. ఈ చయహాని వంశమువారలు ముప్పదివకక్కమంది రాజ్యము చేసియుండిరి. చయహాని జ్యేష్ఠ కుమారుడు తోమరుడు పది సంవత్సరములు (క్రీ॥ పూ. 38‍ -372 వరకు) అజమేరు రాష్ట్రమును పాలించిన పిమ్మట ఇంద్రప్రస్థము (ఢిల్లీని) సంపాదించి అచటికి వెళ్ళి యున్నాడు. ఈ వంశములో ముప్పదవవాడు సోమేశ్వరుడు. తోమర వంశములోని "అనంగపాలుడ"ను రాజు యొక్క రెండవ కుమార్తె "కీర్తిమాలిని"ని వివాహమాడి యున్నాడు. ఈ సోమేశ్వరునికి దుంధుకార, కృష్ణకుమారక పృధ్వీరాజు అనెడి ముగ్గురు కుమాళ్ళు. అనంగపాలుని పెద్దకుమార్తె "చంద్రకాంతి" అను నామెను శుక్లమహాజువంశములో యిరువదిఆఅవ రాజగు దేవపాలునికిచ్చియుండెను. ఈ దేవపాలునికి "జయచంద్ర, రత్నఖానల" అనెడి ఇద్దరుకుమాళ్లు. ఈజయచంద్రుని కుమార్తెయే "రాణీసంయుక్త". తోమరవంశములోని అనంగపాలునికి జ్యేష్ఠ కుమార్తె కుమారుడు జయచంద్ర, రెండవ కుమార్తెకు మూడవ కుమారుడైన పృధ్వీరాజు లిద్దరు దౌహిత్రులు. అనంగపాలునికి పుత్రసంతానము లేనందున తన ఢిల్లీ రాజ్యమును అధిక ప్రతాపశాలి యగు వయహాని, సమలదేవు వంశములోని "పృథ్వీరాజున కిచ్చియుండినందున జయచంద్రు డాగ్రహించి పృధ్వీరాజు మీద శత్రుత్వమును వహించి ఆతనిని నాశనముచేయ సంకల్పించెను. ఈ ప్రకారము వృద్ధిపొందిన జయచంద్ర పృధ్వీరాజుల వైరమే అగ్నివంశ నాశనమునకు మూలమయ్యెను. "ఏవంజాతం తయోర్వైర మగ్నివంశ ప్రణాశనం" (భవిష్య. 3-3-౫-32 అని పురాణము చెప్పియున్నది. కురుక్షేత్రములో

మ్లేచ్ఛులతో జరిగిన యుద్ధమున చపహానివంశ మంతరించినది అటు పిమ్మట పురాణ మిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ "చపహానేశ్చ సకులంఛాయయిత్వాదివం యయౌ ॥
తస్యవంశేషు రాజన్యా స్తేషాంపత్న్యః పిశాచకైః ॥
(భవిష్య 3-౪-౨-౨౬)

,, మ్లేచ్ఛైశ్చ భుక్తపత్న్యస్తా బభూవుర్వర్ణ సంకరాః ।
నవై ఆర్యాన వైమ్లేచ్ఛా జట్టాజాత్యాచ మేహానాః ॥ (౨౭)

శ్లో॥ మేహానామ్లేచ్ఛ జాతీయాజట్టా ఆర్యామయాః స్మృతాః ।
క్వచిత్క్వచిచ్ఛ యేశేషాః క్షత్రియాశ్చపహానిజాః ॥ (౨౮)

తా॥ చపహాని వంశమువారు దివంగతులైన పిమ్మట ఆ వంశములోని స్త్రీలు పిశాచులైన మ్లేచ్ఛులవలన బలాత్కారముగా చెరబెట్టబడినవారైనందున వారి సంతతి వర్ణసంకరులైరి. వారు ఆర్యులుగాని మ్లేచ్ఛులుగాని గాక జాతివలనవారు జాటులను జాతిగాను, మేహానులను జాతివారలుగాను నైరి. మేహానులు మ్లేచ్ఛాచారములుగలిగి మ్లేచ్ఛులుగాను, జాటులు ఆర్యాచారముల గలిగిన వారలుగానునైరి. మ్లేచ్ఛుల చేజిక్కక మిగిలిన కొందరు అచ్చటచ్చట యుండిరి. వారందరు క్షత్రియులుగా పరిగణింపబడిరి.

"చయహాని" "రాజుకు" "చపహాని" యనియు, "వయహాని" యనియు పేర్లు గలవు.

## చయహాని వంశవృక్షము

1. వయహాని
2. సోమర (సోమరునిసోదరుడు)
3. సామలదేవ
4. మహాదేవ
5. అజయ
6. వీరసింహా
7. బిందుసుర
17. వీరసింహ
18. విబుధః
19. చంద్రరాజ
20. హరిహర
21. వసంతః
22. బలాంగః
23. ప్రమథ

8. విక్రమ (వీరవిహాంతక)
9. మాణిక్యః
10. మహాసింహః
11. చంద్రగుప్తః
12. ప్రతావ (రెండవ చంద్రగుప్త)
13. మోహాన
14. శ్వేతరాయు
15. నాగవాహ
16. లోహాధర
24. అంగరాయ
25. విశాలః
26. సారంగదేవ
27. మంత్రదేవ
28 జయసింహ (ఈత డార్యావర్త మును జయించెను.)
29. ఆనందదేవ
30 సోమేశ్వరః
31. దుంధుకార, కృష్ణకుమారక,

పృధ్వీరాజు ముగ్గురు కుమాళ్ళు. 1 వ వానికి "మధుర" 2 వ వానికి ఆజ్మీరు, 3 వ వానికి ఢిల్లీ రాజ్యము. ఈ వంశమువారు కలి 2710 – 4295 (క్రీ॥ పూ॥ 392 – క్రీ॥ శ. 1193) వరకు వరిపాలించి కురుక్షేత్ర యుద్ధముతో అంతరించిరి.

*

# శుక్లవంశం (ద్వారకా నగరం)

## శుక్ల లేక చాళుక్యవంశ కధనం

### శ్రీ భవిష్య మహాపురాణం ప్రతి సర్గపర్వం చతుర్థ ఖండం తృతీయోధ్యాయం

శ్లో॥ "శుక్లవంశం ప్రవక్ష్యామి శృణు విప్రవరాదితః
యదాకృష్ణః స్వయంబ్రహ్మత్యక్త్వా భూమిం స్వకంపదం॥ ౧

శుక్లవంశమును చెప్పుచుంటిని వినవలసినదని ప్రారంభించి శ్రీకృష్ణ భగవానులు భూమిమీద దాల్చిన యవతారమును చాలించి విష్ణుపదమును జెందిన యనంతరము దేశస్థితిని కొంచెము వర్ణించి పురాణమిట్లు చెప్పుచున్నది—

"మహోత్తమమైన బ్రహ్మావర్త దేశమునందు "కాశ్యపుడను" బ్రాహ్మణుడుండెను. "ఆర్యావతీ" యనెడి పతివ్రత ఆయన భార్య. దేవతలకు రాజైన ఇంద్రుడు కాశ్యపుని భారతదేశము మ్లేచ్ఛులచే బాధింపబడకుండుటకుగాను రాజ్యభారమును వహించునట్లు ప్రేరేపించెను. ఆ దంపతులకు పదిమంది కుమారులు గలిగిరి." వారి పేర్లు—

(1) ఉపాధ్యాయః, (2) దీక్షితః, (3) పాఠకః (4) శుక్లః, (5) మిశ్రకః, (6) అగ్నిహోత్రీ, (7) ద్వివేదీ, (8) త్రివేదీ, (9) పాండ్యః, (10) చతుర్వేదీ అనువారలు. అందు భారతదేశ భాగమును పరిపాలించిన నాలుగవవాడైన శుక్లుని వంశము చెప్పబడుచున్నది. మిశ్రకుడనెడి ఐదవ కుమారుని మిశ్రదేశమునకు (ఈజిప్టు) రాజునుగా జేసెను. అతని పేరున ఈజిప్టు దేశమునకు మిశ్ర దేశమను పేరు కలిగెను.

ఆ కాశ్యపుడు మిశ్రదేశమునకుపోయి, లోగడ వేదధర్మములను వదిలి మ్లేచ్ఛ ధర్మము నవలంబించి మిశ్రదేశము లేక ఈజిప్టు దేశమందునివసించుచుండిన వారిని పదివేలమందిని తన పాండిత్యముచే నచ్చచెప్పి వారిని తన శిష్యులుగా జేసుకొని వారికి వైదికధర్మమందాసక్తి కలిగించి వారిని భారతదేశమునకు తెచ్చి స్థాపించెను. వారు శూద్రజాతియందొక శాఖగా పరిగణింపబడిరి.

ఆ విషయమిట్లు పురాణమందు చెప్పబడినది.

శ్లో॥ "మిశ్రదేశోద్భవాన్ మ్లేచ్ఛాన్వశీకృత్యాయుతం ముదా।
స్వదేశం పునరాగత్య శిష్యాంస్తాన్ సచకారహ॥ (3-4-3-13)

,, నష్టాయాం సప్తపుర్యాంచ బ్రహ్మావర్తం మహోత్తమం।
సరస్వతీ దృషద్వత్యోర్మధ్యగం తత్రచావసత్ ॥ ౧౪ ॥

,, స్వపుత్రం శుక్లమాహూయద్విజశ్రేష్ఠం తపోధనం।
ఆజ్ఞాప్య రైవతం శృంగం తపసేతు పునః స్వయమ్ ॥ ౧౫ ॥

,, నవపుత్రాంస్తథా శిష్యాన్మను ధర్మం సనాతనం॥
శ్రావయామాస ధర్మాత్మా సరాజా మను ధర్మగః ॥ ౧౬ ॥

శ్లో॥ శుక్లోపి రైవతం ప్రాప్య సచ్చిదానంద విగ్రహం ॥
వాసుదేవం జగన్నాథం తపసాసమతోషయత్ ॥ ౧౭ ॥

,, తదా ప్రసన్నో భగవాన్ ద్వారకానాయకో బలీ ॥
కరేగృహీత్వా తంవిప్రంసముద్రాంతముపాయయౌ ॥ ౧౮ ॥

,, ద్వారకాం దర్శయామాస దివ్యశోభాసమన్వితాం ।
వ్యతీతే ద్వి సహస్రాబ్దేకించిజ్జాతే భృగూత్తమ ॥ ౧౯ ॥

,, అగ్నిద్వారేణ ప్రయయౌ సశుక్లో అర్బుదపర్వతే ।
జిత్వాబౌద్ధాన్ద్విజైః సార్థం త్రిభిరన్యైశ్చ బంధుభిః ॥ ౨౦ ॥

,, ద్వారకాన్నా-రయామాస హరేశ్చ కృపయాహిసః ॥
తత్రోష్య ముదితో రాజా కృష్ణధ్యాన పరోభవత్ ॥ ౨౧ ॥

,, పశ్చిమే భారతే వర్షే దశాబ్దం కృతవాన్నృపం ।
నారాయణస్య కృపయావిష్వక్సేనః సుఖోఽభవత్ ॥ ౨౨ ॥

తా॥ (కాశ్యపుడు) మిశ్రదేశోద్భవులైన మ్లేచ్ఛులను పదివేల మందిని తన వశముచేసుకొని తన భారతదేశమునకు తిరిగి వచ్చి వారిని తనకు శిష్యులనుగా చేసుకొనెను.

ప్రాచీన కాలమున ఆర్యావర్తమునకు రాజధానిగ నుండిన "సత్తపురీ" యను పట్టణము నశించిపోయినందున సరస్వతీ దృషద్వతీ నదుల మధ్యమందు గల బ్రహ్మావర్తమందు నివసించెను. తనకు పుత్రుడును, ద్విజశ్రేష్టుడును తపోధనుడునైన శుక్లుని పిలిచి రైవతపర్వతము మీదకు పోయి తపస్సుచేయ నాజ్ఞాపించెను. మిగతా తొమ్మండుగురు పుత్రులకును, శిష్యులకును సనాతనమైన మనుధర్మములను బోధించెను. శుక్లుడు రైవగిరికిపోయి నివసించి తపస్సుచేసి జగన్నాథుడైన వాసుదేవుని మెప్పించెను. అంతట ద్వారకా నాయకుడగు శ్రీకృష్ణభగవానులాయనకు ప్రత్యక్షమై ఆ విప్రుని చేయిపట్టుకొని ద్వారకా సముద్ర ప్రాంతమునకు తీసుకొనిపోయి దివ్యశోభా సమన్వితమైన ద్వారకా ప్రదేశమును చూపించెను. కలిలో రెండువేల సంవత్సరములకంటె హెచ్చు

కాలము గతించిన కాలమున ఆ శుక్లుడు అర్బుదపర్వతము (ఆబూ పర్వత మనునదిదే) అగ్నిహోత్రమున హోమద్రవ్యముల వేల్చుచు అగ్ని నుపాసించెను అగ్నిదేవునిచే యీయబడిన క్షాత్రతేజమును పొందిన వాడై తనతోడ నుండిన ముగ్గురు బంధువులగు ద్విజులతోడను కలిసి బౌద్ధులను జయించెను. (యీ ముగ్గు రెవరనగా ప్రమర, చపహాని, పరి హారులనబడువారలు. శుక్లునితో కలిసి వీరు నలుగురు. వీరు అగ్నివంశస్థు లని, అగ్నికులులని, అగ్నికుల క్షత్రియులని, బ్రహ్మ క్షత్రులని గ్రంథ ముల యందుదాహరింపబడిరి వీరే వైదికధర్మ సంరక్షణమునకు నియ మింపబడిన క్షాత్రమవలంబించిన బ్రాహ్మణవంశస్థులు వీరికి ఆంధ్రదేశమున "నియోగబ్రాహ్మణప్రభువు"లని నామము) ఈశ్వరానుగ్రహము గలవా డైన శుక్లమహారాజు ద్వారకా నగరమును నిర్మించి, అందు కృష్ణధ్యాన పరుడై నివసించుచు పశ్చిమ భారతదేశమును పది సంవత్సరములు పరిపా లించెను. ఆ శుక్లమహారాజుకు నారాయణుని అనుగ్రహమువలన "విష్వ క్సేను" డనెడి కుమారు డుదయించెను. ఆ పిమ్మట పురాణమందిట్లు వంశక్రమము చెప్పబడినది.

## చాళుక్య వంశవృక్షము

1. శుక్లః లేక చాళుక్య
2. విష్వక్సేనః
3. జయసేనః
4. విశేనః
5. మదసింహః
6. సింధువర్మః
7. సింధుద్వీపః
8. శ్రీపతిః
9. భుజవర్మః
10. రణవర్మః
14. ఉదయః
15. వాక్పకర్త్రః
16. గుహిలః
17. కాలభోజః
18. రాష్ట్రపాలః
19. జయపాలః
20. వేణుకః
21. యశోవిగ్రహః
22. మహీచంద్రః
23. చంద్రదేవః

11. చిత్రవర్మః
12. ధర్మవర్మః
13. కృష్ణవర్మః

24. మందపాలః
25. కుంభపాలః లేక వైశ్యపాలః
26. దేవపాలః. ఈతడు అనంగ

భూపతి కుమార్తెయైన "చంద్రకాంతి"ని వివాహ మాడెను. ఈ దంపతు లకు జయచంద్రుడు, రత్నఖానలు డను యిద్దరు కుమారులు గలిగిరి. రత్నఖానలుని కుమారుడు లక్ష్మణుడు యుద్ధమందు నిహతుడయ్యెను.

27. జయచంద్రః ఈతడే రాణీసంయుక్తాదేవికి తండ్రి. పృథ్వీ రాజుకు వైరి. మహమ్మదీయులతో కలిసి పృథ్వీరాజును సంహరించిన పిమ్మట మహమ్మదీయులు తన రాజ్యముమీదకు రాగా నదీజలములబడి మరణించెను.

ఆ పిమ్మట శుక్లవంశము మ్లేచ్ఛాచారములచే వర్ణసంకర మాయెను. ఆ విషయము పురాణ మిట్లు చెప్పుచున్నది

శ్లో॥ శేషాస్తుక్షుద్రభూపాలా వర్ణసంకర సంభవాః ।
మ్లేచ్ఛైశ్చదూషితా జాతా మ్లేచ్ఛరాజ్యే భయానకే ॥ ౨౭

,, సమాప్తిమగమద్వంశో వైశ్యపాలస్య ధీమతః ।
కుంభపాలస్య శౌక్లస్య వైశ్యానాం రక్షకస్యచ ॥ ౨౮

తా॥ (గుజరాతు దేశము వైశ్యశ్రేష్ఠు లెక్కువగాగల రాష్ట్ర మగుటచే కుంభపాలునికి వైశ్యపాలుడను నామాంతరము కలిగినది.) శుక్లవంశ సంభవుడైన వైశ్యపాలుడను నామాంతరముగల కుంభపాలుని వంశ మంతటితో సమాప్తి నొందినది. అని చెప్పి బ్రహ్మక్షత్రులుగా మిగిలినవారినిన్ని, బ్రహ్మక్షత్ర వంశమునుండి చ్యుతమై బ్రాహ్మణా చారములు వదలి కేవలము క్షత్రియోచితమైన ఆచారములనవలంబించి క్షత్రియులునైన కుటుంబముల నిట్లు పురాణము వివరించుచున్నది.

శ్లో॥ "విష్వక్సేనాన్వయే జాతా విష్వక్సేనా నృపాః స్మృతాః
విశేనస్యకులే జాతా విశేనాః క్షత్రియాస్మృతాః ॥ ౨౯ ॥

తా॥ పై శుక్లవంశ జాబితాలో రెండవ వాడగు విష్వక్సేన మహారాజు సంతాన మంతయు విష్వక్సేన రాజులని పిలువబడిరి (వీరు బ్రహ్మక్షత్రులుగానే యుండిరి. పై జాబితాలో నాలుగవ వాడగు విశేనుని వంశములో రాజ్యమునేలెడి జ్యేష్ఠ కుమారుడు గాక మిగత సంతాన మంతయు కేవల క్షత్రియాచారము లవలంబించి నందున) విశేనుని కులమందు పుట్టిన వారందరు అదేప్రకారము విశేనులనెడి క్షత్రియులైరి.

శ్లో॥ గుహిలస్యకులే జాతాగాహిలాః క్షత్రియాహితే।
రాష్ట్రపాలాన్వయే జాతారాష్ట్రపాలాః నృపాః స్మృతాః ॥ ౭౬ ॥

తా॥ పై శుక్లవంశ జాబితాలో పదియారవ వాడగు గుహిల మహారాజు సంతానము గాహిలులనెడి క్షత్రియ శాఖయైనది. (క్రీ॥ శ. ఆఱవ శతాబ్దమున) పదునెనిమిదవ వాడగు రాష్ట్రపాలుని వంశమువారు "రాష్ట్రపాలు" లనెడి పేరున బ్రహ్మక్షత్రుగానే యుండిరి. (వీరు రాష్ట్రకూటులనువారు కావచ్చును.)

శ్లో॥ వైశ్యపా స్యవై వంశే కుంభపాలస్య ధీమతః ॥
వైశ్యపాలాశ్చ రాజన్యాబభూవు ర్బహుధాహితే॥ ॥ ౭౭ ॥

తా॥ వైశ్యపాలుడను కుంభపాల మహారాజు యొక్క వంశము వారలు బహుశాఖోప శాఖలుగానై వైశ్యపాలులనెడి పేరున బ్రహ్మక్షత్రులుగానే యుండిరి.

## పరిహార వంశము

(కలింజర నగరం — వంగదేశము)

శ్లో॥ "భృగువర్య శృణుత్వంవై వంశం పరిహారస్యచ।
జిత్వా బౌద్ధాన్ పరిహారో ౽ థర్వవేద పరాయణః॥
(భవిష్య 3_4_4_1)

తా॥ ఓ భృగుశ్రేష్ఠుడా! పరిహార వంశము చెప్పబడుచున్నది వినుము అథర్వవేద పరాయణుడైన పరిహార మహారాజు బౌద్ధులను గెల్చి వైదిక ధర్మమును స్థాపించెను.

ఈయన శక్తి పూజకుడై యుండి చిత్రకూటాద్రి ప్రదేశమున (వంగ దేశమున) కలింజర పురమను పట్టణమును నిర్మించి వంగదేశమును పాలించెను. ఈ వంశపు రాజులు క్రీ॥ శ. 1193 సం॥రము వరకు రాజ్యము చేసినవారలు ముప్పది అయిదుగురై యుండిరి. ఈ వంశములో యీతని కుమారుడు గౌరవర్మ తన సోదరుడైన ఘోరవర్మను కలింజర నగరమున రాజ్యమునందుంచి తాను గౌడదేశమును జయించి రాజ్యము చేసెను. ఈ వంశములో ఎనిమిదవవాడు కాలివర్మ ఈతడు కాళీశక్తి నుపాసించి గొప్ప యుత్సవములు చేయించుచుండెడివాడు. ఈతడే కాళీదేవత పేరున కళికాతా నగరమును నిర్మించెను. ఇదియే క్రమముగా కలకత్తా అను పేరున యిప్పుడు ప్రసిద్ధికెక్కినది. ఈ వంశమున పదహేనవవాడు భోజవర్మ. ఈతడొక రాష్ట్రమును నిర్మించి దానిని తన పేరున భోజరాష్ట్రమని పేరు పెట్టెను. ఇందు పదిహేడవ రాజగు వింధ్యవర్మ గౌడదేశమును జయించెను. (కళింగ రాష్ట్రము లేక ఒరిస్సా రాష్ట్రము) ఇందు యిరువదైదవవాడు శాంతివర్మ. గంగా తీరంలో శాంతి పురమును నిర్మించెను. ఈతని కుమారుడు (26వ రాజు) నదీవర్మ గౌడదేశమును జయించి రాజ్యము చేసెను. "పూరీ" నగర నిర్మాణ మొనర్చెను.

## గంగ వంశము

ఈతనినుండి యీ వంశమునకు "గంగవంశ"మని లోకములో ప్రసిద్ధి కలిగినది.

శ్లో॥ గంగావంశస్తతో జాతో విశ్రుతోఽభూన్మహీతలే ॥

(భవిష్య 3-౪-౪-౨౭)

ఈ వంశమున ముప్పదిమూడవవాడు కలివర్మ మహారాష్ట్రమును జయించి పాలించెను. ఈ వంశములోని ఆఖరురాజు రెండవ మహీపతి ఈతడు కురుక్షేత్రమందు మ్లేచ్ఛులతో జరిగిన (స్థానేశ్వర యుద్ధము)

యుద్ధమందు ప్రాణము లర్పించి స్వర్గమును పొందెను. ఈ విధమున అగ్ని వంశ మంతయు (బ్రహ్మక్షత్ర వంశము) దేశ సంరక్షణమునను, ధర్మ సంరక్షణము నిమిత్తమునను పోరాడి తమ ప్రాణము లర్పించి ధన్యులైరి. వీరలేగాక అచ్చటచ్చట చెదురుగా నిల్చియుండిన సూర్య చంద్రవంశములు కూడను ఈ మహాయుద్ధమున అంతరించినవి. పరిహార మహారాజు యొక్క రెండవకుమారుడైన "ఘోరవర్మ" కలింజరపురమున రాజ్యము చేసియుండెను. ఆతని కుమారుడు శార్దూల మహారాజు. ఈతని వంశపు రాజు లందరు శార్దూలీయులు అని పిలువబడిరి. వీరలు దేశమునం దనేక రాష్ట్రములను సంపాదించి పరిపాలించిరి. శార్దూల వంశీయులు బ్రహ్మక్షత్రులుగానే యుండిరి.

శ్లో॥ తదన్వయేచ యేభూపాః శార్దూలీయాః ప్రకీర్తితాః ।
భూపానాం బహుధారాష్ట్రం శార్దూలాన్వయ సంభవం ॥
(౩-౮-౮-౩౭).

,, "ఇతి తేకథితం విప్రపావకీయ మహాభుజాం ।
కులం సకలపాపఘ్నం యద్వైవశశిసూర్యయోః ॥ (౩-౮-౮-౮౦).

తా॥ ఈ అగ్నికులజులైన రాజుల చరిత్ర మీకు చెప్పబడినది. సూర్యచంద్రవంశముల కీర్తించిన పాపములు తొలగినట్లు యీ అగ్ని వంశపు రాజుల చరిత్రను వినిన సకలపాపములు నశించును. అని పురాణమందుపసంహారము చెప్పబడినది.

## పరిహార వంశ వృక్షము

(కలి 2710–4295 వరకు)

(కలింజరపురం — వంగదేశం)

(1) పరిహార, (2) గౌరవర్మ, (3) ఘోరవర్మ, (4) సువర్ణ, (5) రూపణ, (6) కారవర్మ, (7) భోగవర్మ, (8) కాలివర్మ (ఇతడు "కలికాతా" నగర నిర్మాణ మొనర్చెను) (9) కౌశిక, (10) కాత్యాయన, (11) హేమవతః, (12) శివవర్మ, (13) భావవర్మ, (14) రుద

వర్మ, (15) భోజవర్మ, ("భోజవర్మ" అరణ్య ప్రదేశమున "భోజరాష్ట్ర" మును నిర్మించి పాలించెను) (16) గవవర్మ, (17) వింధ్యవర్మ (తమ్మునికి రాజ్యమిచ్చి తాను వంగదేశమును పాలించెను) (18) సుఖసేన, (19) బలాక, (20) లక్ష్మణ, (21) మాధవ, (22) కేశవ, (23) శూర సేన (24) నారాయణ, (25) శాంతివర్మ, (గంగా తీరంలో "శాంతి పురం" నిర్మించినాడు) (26) నదీవర్మ, (గౌడదేశమును జయించి "పూరీ" నగరమును నిర్మించెను. ఈతని నుండి యీ వంశమునకు "గంగవంశ"మని పేరు గలిగెను. (భవిష్య. 3-4-4-27) 27) సారంగదేవ, (28) గంగ దేవ, (29) అనంగ భూపతి, (30) మహీపతి 1., (31) రాజేశ్వర, (32) నృశింహ, (33) రెండవ కలివర్మ, (ఈతడు మహారాష్ట్రమును జయించెను. (3-4-4-32) (34) ధృతివర్మ, (35) మహీపతి !!

పై నాలుగు అగ్నికుల వంశములు అనగా క్షాత్ర మవలంబించిన బ్రాహ్మణ రాజుల వంశములలో మిగిలి యుండిన కొన్ని శాఖల వారిప్పటికిని రాజపుటానా, పంజాబు, ఉజ్జయినీ, ఆంధ్రదేశము మొద లైన ప్రాంతముల గలరు. ఆంధ్రులు గాక మిగత వారు బ్రహ్మక్షత్రులని యిప్పటికిని చెప్పుకొనుచుండిరి. బ్రిటిషు పరిపాలన కాలమున వీరు మహా శూరులైన సైనికులుగా నుండి మిలిటరీలో యొక పటాలముగా నుండి యుండెడివారు, ఇప్పుడు కూడను వీరి పటాలముండి యుండవచ్చును. వీరి యునికిని గురించియు, వీరు బ్రహ్మక్షత్రులను పేరున యొక శాఖగా యిప్పటికి నుండిరనియు యీదిగువ చరిత్రకారుల సాక్ష్యముల వలనను, యిటీవల దొరకబడిన శాసనముల వలనను మనకు స్పష్టపడుచున్నది. ఆ వాక్యములు దిగువ నిచ్చుచుంటిమి. ఆంధ్రదేశములోని వారలు 14,15 శతాబ్దముల వరకు రాజ్యములు చేయుచుండిరి. ఆ కాలములో రాబడిన మహమ్మదీయ దాడులలో దేశసంరక్షణమున మహమ్మదీయ మతావేశపరుల నెదిరించి యుద్ధములలో ప్రాణముల గోల్పోయి వీర స్వర్గము నలంకరించిరి. ఆంధ్రదేశమున విస్తారముగా చాళుక్యవంశము వారు రాజులుగా రాజ్యములు పరిపాలించి యుండిరి వీరు ఆంధ్రులై యుండిరి. వారి రాజ్యపరిపాలనాదుల యందుద్యోగి వర్గముగా యేర్పడిన

బ్రాహ్మణులు కూడను నియోగ బ్రాహ్మణులనుపేరున పిలువబడిరి. ఈ నియోగ బ్రాహ్మణులు తమ బ్రాహ్మణాచారముల నొదలక శాస్త్రాధ్యయనాదుల నొనర్చుచు వైశ్యదేవ, అగ్నిష్టోమాది యాగముల నాచరించుచు స్వధర్మ త్యాగము లేకనే రాజ కార్యములందు రాజులకు తోడ్పడి మంత్రులుగాను, సైన్యాధ్యక్షులుగాను, సామంతులుగాను రాష్ట్రపాలురుగాను, గ్రామపాలురుగాను పనిచేసి దేశమును ధర్మయుక్తముగా పాలించిరి. రాజ్యాధికారములు యిప్పుడు లేకపోయినను వారి రాజ ఠీవి, దాతృత్వము, వారి యౌదార్యము, త్యాగము, ఆశ్రిత పక్షపాతము, ధీరత్వము వేదశాస్త్రాధ్యయన మొనర్చిన పండితుల నాదరించెడి యోగ్యత ప్రాచీన విద్యా వ్యాసంగమునందు ప్రీతి, కవితా గోష్ఠియం దత్యంతాసక్తి మొదలగు యోగ్యతలు వారియందు నేటికిని ప్రస్ఫుటమగుచు కానవచ్చుచునే యున్నవి కాల పరిపాక వశమున రాజ్యాధికారములు పోయినందున "నియోగబ్రాహ్మణ ప్రభువులు" అనెడి పదమునుండి ప్రభుశబ్దము లోపించినది రాజ్య పాలనాది కార్యములేనాడు లోపించినవో ఆనాడే వారి "నియోగిత్వము"కూడ లోపింపవలసి యున్నది. "నియోగ" శబ్దము నొదలిన మిగులునది "బ్రాహ్మణ"శబ్దము మాత్రమే.

ఇకను వేదసంరక్షకులుగాను, ధర్మ ప్రచారకులుగా నుండిన వైదికబ్రాహ్మణులు భోగాపేక్షులు, విషయ ప్రవిష్టులు నై రాజకీయోద్యోగములలోను, యితర లౌకిక వృత్తులయందును ప్రవేశించి వేద శాస్త్రాధ్యయనముల నొదిలినందున "వైదిక" శబ్దము లోపించగా "బ్రాహ్మణ" శబ్దము మాత్రము మిగిలినది. ఉభయులకు "బ్రాహ్మణ" శబ్దము మాత్రము మిగిలియున్నందున యొకరికొకరు హెచ్చుతగ్గులు లేక సమానహోదా యందుండిరి. ప్రస్తుతము యుభయు లుపయోగించుకొను చుండిన వైదిక, నియోగ పదములయందుభయులకు అధికారము లోపించినది. గాన వుభయులు బ్రాహ్మణ మాత్రులుగా నుండియు యొకరియందొకరు వైషమ్యభావము నొందియుండుట తగని పని. ఉభయులు స్నేహబాంధవములు గలిగి ప్రవర్తించకున్న రాగల

కాలమున బ్రాహ్మణ సంఘమునకు స్థాన ముండదు ఉభయు లేకమై తమ యుండింకను బీజప్రాయముగా నిలిచియుండిన వేదశాస్త్రాధ్యయన మొనర్చు శ్రోత్రియుల నాదరించి కాపాడుట విధి. లౌకిక వృత్తియందు నేర్పుగలిగి ప్రవర్తించెడి వారలీ దేశమునను, విదేశముల యందును ద్రవ్యసేకరణ మొనర్చి "శ్రోత్రియ బ్రాహ్మణుల" కాపాడుకొను టత్యవసరము. శ్రోత్రియ బ్రాహ్మణు లున్నంతవరకే బ్రాహ్మణ సంఘమునకు గౌరవము గలిగియుండునని జ్ఞాపకముంచుకొనుడు

## పాశ్చాత్య చరిత్రకారుల వాక్యములు

"The pallavas trace their ancestry from Aswathama the son of Drona, the General of the kurus' Some trace descent from the Sacrificial fire, such as Paramaras, Chahumanas and others."

(Vide His. of Ind. P 39. By Mahamahopadyaya Haraprasada Sastry. M. A.)

తా॥ పల్లవులు కౌరవసైన్యాధి పతియైన ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామ నుండి తమ వంశమును చెప్పుకొందురు. వీరిది భారద్వాజస గోత్రము వీరిలో కొందరు పరమార, చాహుమాన మొదలగు అగ్నివంశస్థులమని చెప్పుకొందురు.

"విన్సెంటుస్మిత్" మహాశయుడు తన అర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా 435 పుటలో నిట్లు వ్రాసియున్నాడు :—

"We have already seen that a Chatsw inscription speaks of a Guhilot king Bhartribhatta as Brahmakshatranvita (బ్రహ్మక్షత్రాన్విత) which I have translated by "possessed of both priestly and martial energy", but a foot-note has been added below saying that what is also implied is that Bhartribhatta was a Brahmakshatri, i. e. belonged to the Brahmakshatri caste. Bhartribhatta is not the only ancient king of India

